— శ్రీమత్పరదేవతాయై నమః —

# * మల్లేశ్వర విజ్ఞప్తి *

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి. శతావధాని

వేం: టేశ్వర ప్రింటింగ్ ప్రెస్. ఆలమూరు.

శ్రీ మత్పరదేవతాయై నమః

శ్రీ

# * మల్లేశ్వర విజ్ఞప్తి *

(శతక మకుట కావ్యము)

రచన:

చెళ్లపిళ్ల. వేంకటశాస్త్రి. శతావధాని

ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం - P. O.

తూర్పుగోదావరి జిల్లా.

## * హెచ్చరిక *

1920 సం॥రం ప్రాంతంలో ప్రారంభింపబడి 1930 సం॥రం లోగా ముగింపబడినట్లు అనుమానింప బడుతూన్న యీగ్రంథ రచనకు కారకు లెవరైనదిన్నీ సప్రమాణంగా తెలియనప్పటికిన్నీ "శాపా దపి - శరాదపి" అనే న్యాయానికి ఉదాహరణ ప్రాయంగావుండే యీ గ్రంథంలోని స్వరూప స్వభావాదులననుసరించి, గుమ్మడి కాయల దొంగలవలె యెవరున్నూ బుజాలు తడుముకో కూడదని న్నీ, అముద్రితములైన గ్రంథకర్తగారి గ్రంథాలన్నీ ముద్రించ డమే ప్రకాశకుల ముఖ్యతాత్పర్యంగాని వేతేమీకాదనిన్నీ పాఠక లోకానికి మా విన్నపము.

అన్ని హక్కులున్ను ప్రకాశకులవి.

వెల 1-4-0

★

మొదటికూర్పు: వెయ్యిప్రతులు 1955

ముద్రణము: వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్, ఆలమూరు.

# * కథాసంగ్రహము *

——//——

అనగా అనగా ఓవూరు. ఆవూళ్లో దేవుడిపేరు మల్లేశ్వరస్వామి. ఆయన్ని పూజిస్తూవుండే పూజారి వంశములో వొక ప్రబుద్ధుడు పుట్టేడు. ఆప్రబుద్ధుడికే పూజారి అనీ లెంక అనీ, పేళ్లు ఇతనికి లౌక్యంలో మంచి ప్రజ్ఞవుంది. అందుకే ఒక బ్రాహ్మణమాన్యాన్ని ఒకగొల్ల రహితుద్వారా కాజేసి అందులో వకవాటాకూడా అక్రమంగా సంపాదించాడు.

యితగాడికి కుంకలతో చాలా స్నేహంవుంది. యీకుంకలు సంఖ్యకు అయిదుగురు అందులో పెద్దవాడు లెంకకు అన్యాయకార్యాలుచేసే ప్రసక్తిలో కుడిబుజంవలె ఉంటుండేవాడు. యీకుంకల కావూళ్ళో వకచోట దుడుపు (మాగాణి) పొలం వుండేది. ఆపక్కనే యీగ్రంధకర్తకున్ను వుండేది. యింకోవైపున మతోమంగలికిన్నీ వుండేది. యీచేలకు నీరువచ్చే నిమిత్తం అక్కవొక బోదికాల్వ ఉండేది. అసలు తగాదా దానిదగ్గరే గ్రంధకర్తకున్ను కుంకలకున్ను ఓంప్రథమంగా ప్రారంభమైంది. స్వతహాగా కుంకలు తుంటర్లే అయినా అంతకుముందు గ్రంథకర్తకు విధేయులుగానే వుంటుండేవారు. కుంకల్లో వొకడు గ్రంధకర్త వద్ద శుశ్రూషకూడా చేసేవాడట పోదితగాయిదా- రాజీకిన్ని అతీతమై అప్పట్లో గ్రంథకర్త ఆభూమిని అన్యాక్రాంతం చేయడంతో ముగిసిపోయింది.

అపునా : యిదిల్లావుండగా ఆవూళ్ళోనే బ్రాహ్మణ కులంలోనే వ్యభిచారంలో ఆరిందాగా సంచరించే వొక యేబ్రాసి వుండేది. ఆవిడితో కుంకల తండ్రికిన్నీ కుంకలలో కొందరికిన్నీ గూడా సంబంధం వుండేవి. ఆసందర్భములో కొంచెం గ్రంథకర్తచే మందలింపబడ్డ కుంకలు ఆ గ్రామములో యేకొంచెమో ఆనాటి సంఘకట్టుబాట్లద్వారా న్యూనతగా చూడబడుతో వుండిన్నీ వెలిమాత్రం వేయబడకుండా సంఘంలోనే

కలిసి మెలిసి వుంటూవచ్చారు కాని గ్రంధకర్త మీద లోలోపల వీళ్ళకు అక్కసు మాత్రం వుండేది. గ్రంధకర్త ఆనాటికి బందరులో ఉపాధ్యాయవృత్తి విరమించుకొని విశ్రాంతిగా కాలంగడిపేనిమిత్తం స్వగ్రామం చేరుకొని వున్నాడు యీయన చేరుకొనేనాటికే గ్రంధంలోని గ్రామపాచకుడున్నూ ఆగ్రామంలోనివసిస్తో అన్నంలేని కారణంగానో, ఆనాటికి కుటుంబములేని కారణంగానో ఆగ్రామంలోని "స్వైరిణ్యగ్రణి" గారింట్లోనే ఉంటుండేవాడు. వూరికే, ఉండడమేకాక ఆవిడతో సంబంధంతోనే ఉండేవాడు. ఇతను క్రమశః, లెంకకుంకలకు తుంటరితనంలో ప్రధానహంగుదారుగా ప్రవర్తిస్తుండేవాడనేది సారాంశం — ఈగాధ యిలావుండగా ఉద్యోగరీత్యా ఆవూళ్ళోకాపురం చేస్తూవున్న బ్రహ్మబంధు వొకాయన స్వగృహములో పెళ్ళిచేస్తో గ్రామంలో వుండేయావన్మందినీ ఆశీర్వచనానికీ భోజనానికిన్నీ పిల్చాడు బ్రహ్మబంధువంటే ? బ్రహ్మ సమాజమతస్థుడన్నమాట యీలాటి సంస్కారాలకింకా ఆనాటికాలం అనుకూలం కలది కాకపోవడంవల్ల ఆ గ్రామంలోని బ్రాహ్మణ్యమంతా ఆ పెళ్ళిలో యేవిధంగానూ పాల్గొనకూడదనీ నిశ్చయించుకుంది. కానిఆనిశ్చయానికి అంతిమ ఘట్టంలో వొక విఘాతం వచ్చిపడింది. యెల్లానంటే గ్రంథకర్తకు గురుపీఠంలో వుండే పరమపూజ్యులు కొందఱు ఆసంస్కరణ వివాహానికి ఆహూతులై వచ్చివున్నారు - వారితోపాటుగా గ్రంధకర్తయున్నూ కలిసివెళ్ళకతప్పదు - అందుకని - తానుచెప్పితేవినే గ్రామంలోని బ్రాహ్మణ్యానికంతకీ వర్తమానించి - తానుగూడా ఆవివాహంలో పాల్గొని యీదిగువ ఆశీర్వచన పద్యాలుకూడా చెప్పడం జరిగింది ఆ యీ పద్యాల భావాన్ని పరిశోధిస్తే ఆనాటి గ్రంధకర్త హృదయ మథనమనమే గ్రహించవచ్చు —

శా. ఘోరంబైన తపంబొనర్చి, అనలాక్షున్ మెచ్చఁగాఁజేసి. త
ద్ధీరత్వమ్ము సడల్చి - కాయజునకున్ దేహాంతరప్రాప్తి చే
హాఁబన్ జేసి - రతిన్ గలంచిన కుభృత్కూటస్థలావాసి -సీ
తానామాఖ్యవధూమణిన్ మనుచుఁగాతన్ రామకృష్ణాఖ్యునిన్.

శా, సారాచారుని - ఛాందసుణ్ - దనపతిన్ సంసారసాహిత్యపున్
గారాబంబున మగ్న మానసునిగాఁ గావించి సంసార సం
సారం బిట్టిదటంచుఁ దెల్పిన సరస్వత్యంబ ప్రేమించి - సీ
తారామాఖ్యవధూమణిన్ మనుచుఁగాతన్ రామకృష్ణాఖ్యునిన్.

యీపద్యాలలో యిమిడ్చిన కల్పనవల్ల గ్రంథకర్త హృదయం సుగమమే కనక విస్తరించేది లేదు ఆ యీ హృదయాన్ని తెలుసుకోవడం చేత కాని లెంకయున్ను కుంకలున్ను గ్రామపాచకుడున్ను గ్రంథకర్తను దూషించడానికి పుపక్రమించడంతో అంతక్రితం బోదెకాల్వతో ముగిసిపోయిన వైరం మళ్ళీ తలెత్తింది-, అదే మల్లేశ్వర శతకపు కుటానికి అంకురార్పణమై రకరకాలైన తరహాలలో గ్రంధకర్తను బాధించిన తుంటరుల దుష్టకృత్యాల స్వరూప స్వభావాల వర్ణనలలో ఆఖు పందల పద్యాలవఱకున్ను పెరిగి, ధారాశుద్ధితోపాటు వాక్శుద్ధిన్నీ గల గ్రంధకర్త కోరికలను అనఁగా, శత్రువులు అనుభవించదగిన శిక్షలను గ్రంధకర్త కోరినప్రకారంగా ఆమల్లేశ్వరుడు పూర్తిచేయడమువల్ల అలా పూర్తిచేసినట్లు విశ్వాసంగల గ్రంధకర్తచేత అ యీ గ్రంధం ముగింపబడింది.

.... వి ష యా ను క్ర మ ణి క ....

1 వ పద్యం మొదలు - 54 వ పద్యం వరకున్ను పూజారి విషయమున్ను ఆనాటి మల్లేశ్వరుని స్థితిగతులున్ను చిత్రింపబడినవి. 55 నుండి కుంకల్లో వొకని ప్రవేశముకల్గి. వాని సహాయం, లెంకకు ఏవిధంగా ఏర్పడుతుండేదో వివరింపబడుతో 113వ పద్యందాకావెళ్ళి 118 నుండికుంకల వంశవర్ణన ప్రారంభమై 124 తో ముగుస్తుంది 126వ పద్యంలో కనబడే తిలఘాతకుడీ గ్రంథంలో పాత్రధారి కాకపోయినా గ్రామంలోని అతితెలివిన అరిందా లొక్కల్లో వొకడుగా పేర్కొన బడినాడు - అంతే - 168వ పద్యంలగాయతు - 172 వఱకున్ను గ్రామపాచకుని విషయం రచింపబడింది. పీరివిషయం గ్రంథాంతంలోను గ్రంధమధ్యలోను

కూడా వస్తోనేఉంటుంది - 174వ పద్యం మొదలు వొకసత్రపుగుమస్తా కథ వస్తుంది - ఇతడు కుంకలకు పెత్తంద్రికొడుకు. వీని చరిత్ర 190వ పద్యంవఱకున్ను వుంది, 193వ పద్యంలో - అసలు కలహకారణం చెప్పబడివుంది. 167 లో బ్రహ్మబంధువిషయం సూచింపబడినది. 260వపద్యంలోని గాథ - ఏమిటంటే : ఒకబడిపంతులుద్వారా లెంక - గ్రంథకర్తకు నష్టం గలిగించడానికి యత్నించి, ఆపంతులు పెట్టిబాగుల వాడుకావడంవలన విఫలుడైనాడని, ఆదాసీరండకు కొంపకట్టడం కుదురలేదనీగ్రహించాలి 358వ పద్యంలోనిది వొక శూద్రస్త్రీ ఆజన్మబ్రహ్మచారిణి ఉత్తమురాలు 362 లోని వైరం ఆగ్రామంలోనే వొక సంపన్నగృహస్థునితో కుంకలకేర్పాటై — స్థలఖాండవిసర్జన కెంతో తోడుపడినటు జనశ్రుతి 455 లో అయావైర హేతువుగానే గ్రామంలో గ్రంథకర్తనభిమానించే వ్యక్తులు గ్రంథకర్తకు చేసిన గౌరవమని గ్రహించుకోవాలి, 470 లో గ్రంథానికి సంబంధించినంతవఱకు కథ అంతా క్రోడీకరింపబడివుంది. యింకా కొన్నివిషయాలు ప్రసక్తానుప్రసక్తంగా అక్కడక్కడ తగులుతూ వుంటాయి వాట్లకు సంబంధించిన సందేహాలన్నీ ఒకటి రెండు మాట్లు గ్రంథం పఠించినట్లయితే తీరిపోయేవేకనక ఆలా చేయవలసిందిగా పాఠకులకు హెచ్చరిక —

యీదిగువ పదాలు గ్రంథములో యెక్కడ వచ్చినా అవిఅన్నీ కుంకలకు పర్యాయ నామధేయాలని గ్రహింపగోరుచున్నాను.

1 కుంకలు 2 ఋండలు 3 జాల్ములు 4 మూఢాత్ములు 5 కూళలు 4 మందాత్ములు 7 దుష్టులు 8 కంహోష్ఠులు 9 బంధులు 10 విమనులు 11 చండాలురు 12 తుచ్ఛులు 13 దుర్జాతులు 14 అజ్ఞాత్ములు 15 హీనాత్ములు 16 వ్రాత్యులు 17 దర్పాంధులు 18 భషకములు 19 యోగ్యేతరులు 20 కష్టాత్ములు 21 ముండాకొడుకులు 22 దున్నలు 23 రండాకొడుకులు 24 రౌడీలు 25 మొప్పెలు 26 వదరుబోతులు 27 ప్రేతన్నలు 28 ఖలులు 29 నీచులు 30 బూతుంబుంగలు 31 ఎనుబోతులు 32 దరి

దుర్రిలు 33 జడులు 34 దద్దమ్మలు 35 ఉచ్ఛిష్టులు 36 కాఱుదున్నలు 37 చౌరాచారులు 38 సాపాట్రాయులు 39 అధమారాతులు 40 అన్యాయపుంబీనుగులు 41 కూర్రిరారంభణులు 42 లుంటాకులు 43 అనామతరువులు 44 చండాలశాఖామృగాటోపులు 45 వెఱ్ఱిపీస్గులు 46 ద్రావులు 47 బకప్రక్రియులు 48 బరియా కుక్కలు 49 శునకాలాపులు 50 వాజమ్మలు 51 శ్రేయోదూరులు 52 పెండేల దేవయ్యలు 53 గర్వగ్రింధులు 54 మాదర్చోదులు 55 చెపలమ్మలు యిత్యాదులు —

పై నామధేయాలలో కొన్ని కేవలమూ కుంకలకు మాత్రమే కాక గ్రామపాచక తెంకలతో కూడిన కుంకలకున్నూ పర్యాయపదాలుగానే అక్కడక్కడ వాడబడుతోవచ్చాయి అదిగూడా గమనించుకోవాలి - ఆ యీగ్రంథంలో వ్రాయబడిన కుంకలు వగైరాల దుష్టకృత్యాల జాపితాకూడా వ్రాసి మఱిదీన్ని ముగిస్తాను,

1 దైవానికి అపవిత్రాన్నం నైవేద్యం చేయుట 2 దేవాలయంలో సంధ్యాదీపం పెట్టకుండుట 3 దేవుని ఆస్తి తాకట్లుపాల్జేసి సంచరించుట 4 మంచివారిమీదికి రౌడీమూకను ఉసికొల్పుట 5 గ్రంధకర్తపై అబద్ధపు కేసుపెట్టుట 6 గ్రింధకర్త ఆధ్వర్యంలో నడిచే పాఠశాలలో అసహ్యాప్పనులు చేస్తో ఉపాధ్యాయుణ్ణి నానాకూతలుకూసి బరిసాగకుండా ఆటంకాలు కల్పించుట 8 గురువైన గ్రంథకర్తను అడ్డమైన తిట్లు తిట్టుచుండుట 9 గ్రింధకర్త వద్ద విద్యాభ్యాసముచేసే శిష్యుల్ని తిట్టుటయున్ను కొట్టుటయున్ను 10 గ్రింధకర్త యింటిని కూల్చేనిమిత్తం ఎన్నో ప్రియత్నాలు చేయుట 11 గంధకర్త తాలూకు యింటిలోని సామగ్రిని పగటి దొంగలై దొంగిలించుట 12 గ్రంథకర్త నివాసగృహంలోకి పందుల్ని తోలుట 13 గ్రంథకర్తతాలూకు చూడుపశువుల్ని బలవంతంగా కట్టి బాధించుట 14 గ్రింధకర్తను "వెఱ్ఱి వెంకయ్య" అనుట 15 "తరవాణీ" అంటూ గురువైన గ్రంధకర్తను హేళనచేయుట 16 అగ్రిమములోని ఒక వడ్రంగి భార్యతో సంపర్కం కల్పించుకొని

వడ్రింగి సోదరులకు అకారణ విరోధం సృష్టించి చివరికి భార్యాభర్తలకు సంబంధములేకుండా చేయుట 17 శ్రీరామచంద్రునికి ఆలయనిర్మాణం చేసి అందు హరిజన ప్రవేశ సంస్కారంచేసి అంతతో తృప్తిచాలక ఆఆలయాన్ని చివరికి పశువులశాలగా మార్చుట 18 శిచ్చమెత్తుకొనే ముష్టిదానిపై మీసంత్రిప్పి చావగొట్టి శౌర్యప్రదర్శనానంతరం దానిచే శాపనార్థాలు తినుట - ఇల్లాంటి వెన్నో ఉన్నాయి ఎంతవ్రాసినా విషయ మింతే — స్వస్తి !

| | |
|---|---|
| జయ - మహాశివరాత్రి | విద్వాన్ |
| 20 - 2 - 1955. | చెళ్లపిళ్ల దుర్గేశ్వర శాస్త్రి |

---

(షరా) ఈ దిగువవిధంగా కూడా ముద్రాప్రమాదములు - సవరించు కోవలెనని ప్రార్థింతును ....

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 | 10 | ఋనస్ | లనస్ |
| 27 | 15 | రిద్య | రిద్ర్య |
| 41 | 11 | ట్టుపె | ట్టురె |
| 45 | 21 | ధ్యాన | ధ్వాస |
| 61 | 21 | కెడదస్ గోరంతయున్ | కెదలోఁ గించిత్తునుఁ జా |
| 87 | 16 | గీర్మా | గీర్వా |
| 93 | 18 | ర్మక | ర్మ |

శ్రీమత్పరదేవతాయైనమః

# మల్లేశ్వర విజ్ఞప్తి



## * బోదెకొల్వా *

ఉ. బోదెవు నీవుకావు మరి బోధిపదెట్లన నీమ శాఖలో
లేదువినీతి, యోగ్యతయు లేదు, ఋజుప్రతిపత్తి పూర్వమే
లేదు కృతజ్ఞతాగరిమ లేదు, గురుప్రవరాంఘ్రిభక్తియున్
లేదని బోధచేసితి బలే ? యిఁక వర్ధిలు బోదెకొల్వరో 1

ఉ. జేనెఁడొ ? బెత్తెఁడో ? కలవు చేసిన బోధ యపార, మింత వి
జ్ఞానముమున్ననేఁ జదువు శాస్త్రము లేనియుబోధసేయలే
దోనెఱజాణ ? నీ కతన నొందితి నింతకు శాఖ తత్త్వ మిం
కేను నినున్నుతించి కృతకృత్యుఁడ నయ్యెద బోదెకొల్వరో ? 2

ఉ. నీగతి నీప్రవర్తనము నీదగు లోతును నీదుపాతు నీ
లోగడ నున్కియున్ సకలలోకులకున్ విశదంబులయ్యెని
న్నాఁగఁ బ్రియత్నమున్ సలిపినట్టి ప్రబుద్ధుల తెల్వితేటలున్
జేగయుఁ బ్రజ్ఞలెల్లను నిసీ ? యని రోసిరి బోదెకొల్వరో 3

ఉ. పంకము నీ యెదంగలుగు పద్ధతి యుక్తమ కాని నీకొగిన్
సంకెల వేయఁబూను నరిస్వాంతము పంక మొనర్చితెట్లు నీ
కొంకది నేనెఱుంగుదును గొంకకు సంధిని గోరినంత నీ
వంకకుఁ దేరి చూడఁగల వాఁడొకఁడుండఁడు బోదెకొల్వరో 4

చ. పిడుచును జెళ్ళపిళ్ళ వెంటివెంకన నిన్నని కొంకఁబోకు మూ
రడుము వర్థిధా యొకల్ కలహరాగము చూపిన సంధి గోరుటల్
కడుబుధ సమ్మతం బగుట గాటముగాఁ బ్రియతించి నంతనే
తడిసిన నుల్కమంచపుఁ గరల్ గననయ్యెడి బోదెకాల్వరో 5

మ. ఘను సాధించుట న్యాయమంచెఱిఁగియు న్నిక్కమ్ము గ్రామమ్ములో
ఘనులెల్లన్ గనియుండుటల్ దెలిసియున్ గరుక్కరితిన్ జూపువా
రినిలో కానకు మిక్కిలిన్ దెలిపి యుద్రేకమ్ము వారించుటల్
చనుసంచున్ జుమి బోదెకాల్వరో? కడున్ సంధింప యత్నించుటల్

ఉ. అంతియకాని శ్రీమర్రిల సహాయము సన్నిసు గప్పనెంచు సు
స్వాంతుల బుల్పు దీర్చుటకు శక్తత చాలక కాదు నా మనం
బెంత విరక్త మయ్యెఁ బని యేర్పడి నప్పుడు రిత్తవోదునా
పంతమెఱుంగుఁ బండితసభల్ భయమందకు బోదెకాల్వరో? 7

ఉ. పంతము మీది పండిత సభాస్థలులన్ బనిసేయుఁగాని ధీ
మంతులుగాక కేవలము మత్సరులై తమ పట్టినట్టి యా
పంతువు మూఁడుకాళ్ళ దను జాడ్యపరీతులపట్ల పమ్మటం
బెంతువొ? నిక్కమే యయిన నేమగుఁ జూడుము బోదెకాల్వరో 8

మ. సకలమ్మున్ మదిలో నెఱుంగుచును శిష్యత్వమ్ము బంధుత్వమున్
వికలమ్మున్ బొనరింపఁగాఁ దగమిఁ దద్విద్వేషమున్ వైఁచితిన్
సుకవీ సంధిని గోరితిన్ వినక గచ్చుల్ గొట్టుచున్నారు న
న్నిఁకఁ జూడన్ గమకింపు చింతిలకు నీకే లోటులేకుండెడున్ 9

మ. సుకుమారాంగి కొమార్తె గల్గ నొకరాట్పోనుండు తన్మంజుగా
త్రికి భర్తన్ గడునేరి తెచ్చి యుల రాత్రిన్ మూత్రిమున్ గట్టిప
ట్టు కతానెట్టి పరాభవమ్ము గనెనట్టుల్ సుమ్మినిన్ జేనలో
నిపెఁ దేఁగన్ బ్రయతించు వాంఛ్రయులచిన్నెల్ వన్నెలుం బోదెరో

ఉ. వప్పుఁడు లేని బోదె కొఱకెవ్వనినో యనికొల్పి దానిచే
బిస్సను నాకొనర్చుటకుఁ బన్నెడి పన్నుగడల్ క్షణమ్ములో

మన్నయిపోకయున్ననను మానక వేఱొక పేరఁ బిల్వ ను
న్నన్న? యధర్మ మెప్పటికి నాఁగదు ధర్మము ముందు బోదెరో 11

కడుఁ జాణైన పరిదేశ మియ్యెడల జిక్కన్నాను విశ్రాంతి యే
ర్పడు నంచున్ గడియమ్ము వచ్చితిని దుష్ప్రాగల్భ్యధౌరేయు లి
య్యెడఁ గూడన్ బని చెప్పుచుండిరని యెంతే లోన జింతిల్లుచున్
గడుసుం బోకలు మించినప్పు డెటు లోకాలూఁచుటల్ తప్పునే 12

కలహం బియ్యది బంధువర్గమునకున్ గారాదుగా! యంచునే
నలుకన్ లోఁగలుగంగ నీక యలవాం ఛ్రిన్యాయమార్గమ్ము వెం
తలుగాఁ ద్రొక్కిన నైఁచితిన్ గడఁగి సంధానింప యత్నించితిన్
బలవద్దైవము కారణంబగుట నవ్వారొప్పరే త్రోవకున్ 13

ముప్పదితొమ్మిదేఁడులకు మున్నటి నుండియు నున్ననిన్ను మా
యప్పరొ? నేఁడు పూన్చుటకు యత్నమొనర్చెడి వారి నైపుణిన్
తప్పక వర్ణనీయములు తథ్యమెఱింగియు శిష్యులయ్యు వాం
ఛిప్పని పూను హేతువది యెట్టిదొ? తెల్పుము బోదెకాల్వరో 14

అకలంకమ్మగునట్టి నెమ్మనముతో సన్మిత్రయత్నమ్ము ని
త్య కలంకమ్మగు నూహతో నొరులు నేయంబూను యత్నమ్ము దీ
నికి బాహ్యమ్ముల కారణమ్మొకటియున్నేనేర గుర్తించి యుం
తకు నడ్డెంబెట్టి యుష్కపటత న్దాసైన వే హేతువో 15

కపటత్వమ్ము వహించు కారణమొదిన్ గన్పట్ట దింతేనియున్
విపులత్వమ్ము వహించి వర్ధిలుము పృథ్విన్ జాలఁ బేర్గాంచి యా
చపల స్వాంతు లొనర్చునట్టి పనిచేసంచేసియున్ లేదుని
కపకారం బొనరింప నేరికి ననాథ్యం బయ్యెడిన్ బోదెరో 16

పారబుఁజాన బెట్టికొని పాఱెడు నీరుఁ గలట్టి నీకు సొం
పాఱఁగఁ బూడ్చి నెవ్వఁ డతఁ డప్పని చేసిన నైపై వృథాగ న
న్నోరికొలంపలాడెఁదఁ జామి నోరటు జాఱెడు నప్పు డెంతటో
యూరకె వివేకులుండి రిసిరో? యని రప్పనిరోసి బోదెరో 17

మ. మునుదుర్వాసుని యాదవార్భకులెటుల్ మోసమ్ముమైదీరి కూ
ర్చుని వంచింపఁగడంగిరో యటులె శిష్యుల్ "జానెఁడే మూరెఁడే"
యని నిన్నున్ గురియించి హాస్యరచనా వ్యాహారమోహాంధులై
పనినాకున్ గలిగించుచుండిరి వృథావ్యాపారమే పారఁగన్॥ 18

శా. యావత్కాలము నీవృథాకలహ దుర్వ్యాపారపున్ బీజమున్
జాపన్ జేయమి గొప్పముప్పనుచు నే సంధింపఁగానెంచి లా
ఖావిర్భావముఁ జూపినన్ వినరదేమన్యాయమో కాని యో
దేవీ ? వారలతత్త్వమీ వెఱుఁగుచోఁ దెల్పంగదే బోదెరో॥ 19

శా, నీలోతెంతయొ వారెఱుంగుదురుకానీ వారిలోతెంతయో
నీలోనైనను నీవెఱుంగవొకొ ? నీ నీచోపసర్పత్వ మె
ట్లోలిన్ వారికొసంగి డిల్పడితివో యొక్కింత వాకుఱిచ్చుమో
స్థూలంభావుకతాపదోన్ముఖపయస్తోమాఢ్యమా బోదెరో॥ 20

ఉ. మంగలిదొక్కప్రక్క మనమాన్యులు వేఱొకప్రక్క నొక్కనీ
కుంగలలోతుఁ బాతగలి కూలితి కూలుచునుంటి వేసు ని
న్నుంగనినాఁడ నీదగుమనోరథమున్ గనిపెట్టినాఁడ నీ
వెంగలిచర్చలో నడుగువెట్టుట కిష్టములేదు బోదెరో॥ 21

ఆ. వె. కోష్టుకరుగ నొక్క కొనగోటిమాతఱిలోఁ
దీనుపనికినీవు దేబెవగుచు
నప్రతిష్ఠనాకు నంటగట్టెదవేల ?
యంచు నేటికేడ్చెదమ్మ? బోదె ? 22

ఆ. వె. అప్రతిష్ఠ నీకనాదిగనున్నదే
యేనుదానిఁదెచ్చి యీయనేల ?
ఉన్నయప్రతిష్ఠ యూడ్చిపెట్టుటకునై
వారు పట్టుపట్టినారుకాని॥ 23

శా. నీ కేదారము నాదుజీవనముచే నేనెన్నియో వత్సరాల్
సాఁకన్ బండుట నీవెఱింగియును నాచావీవు నైరించుచో

సీకుందాఁకదొకో ? కృతఘ్నత కడునీచాతినీచంబు త
త్త్వాకంబెట్లు భరింతు వంచడుగుటల్ భవ్యంబగున్ బోదెరో॥ 24

చ. ఒరులు కృతఘ్నులైన మదినూరకపోక్కెడి నిన్నువంటి ధీ
వరునకుఁ గూడఁ గైకొనఁగవచ్చునె ? యిట్టికృతఘ్నతా మహా
దురితమటంచు నీవడిగెదో ? యది యట్లిదయౌట నామసం
బెఱుఁగు, నెఱింగియేమిఫల ? మేనలవారికి లొంగిపోయితిన్॥ 25

మ. గురుభక్తిన్ జరణమ్ములన్ దుడిచి దుష్కోపాన నిన్ బూడ్చు న
ద్దురుసుంబాకమువారితోడఁ గడువృద్ధుండైన నేనెట్లు సం
గరమున్ జేయుదు? నీయెడన్మదిఁ గృతఘ్నత్వంబు కైకొంటయే
వర, మీ భారము పూనుచో ఘనులునవ్వన్ బాలుగాకుందునే॥ 26

ఉ. కాలలవారు త్రిప్పుటయుఁ గాలువనేసును త్రిప్పుచుంటయున్
వేలతసంబు వాయొకటి పెప్పగుఁగాక మఱేమి ? తుల్యతే
యీలలిఁ బోరు నిర్వారని యెల్లరునవ్వుట కొప్పు నంకచం
డాలము లీకృతఘ్నత గనంబడనీయవు నాకుఁ గాల్వరో॥ 27

శా. అలనాడల్ల వసిష్ఠధేనువును విశ్వామిత్రుఁడన్ తేఁడు దు
ర్లలితుం డాత్మవశమ్ముజేసికొనఁ దాలక్షింప కమ్మౌని నీ
వలెనే యుండఁగ నేమియయ్యె నటుతేవారిన్ విదారించి నే
నిలుపన్నేత్తు నటంచువో ? నిలుపు నీనేర్పేను వర్ణించెదన్॥ 28

ఆ. వె. సత్తరువులుచెఱుచు సన్మార్గులకు బోదె
కాల్వగప్పుటెంత ఘనతరంబు
"తల్లిచెవులుతెగ్రించు ధన్యాత్ములకునెందు"
బిన్నతల్లిచెవులు బీఱపువులు॥" 29

క. బోదెలునూతులుఁ జెఱువులుఁ
బాదగలన్ ద్రిప్పఁజేయుఁ బ్రాజ్ఞుఁడితరుఁడా
ప్లోపపడువాని నూడ్వఁగ
మీఁదెఱుగనివానిచె యిదిమేదిని నవ్వన్॥ 30

ఆ. వె. బోదెకాల్వలూడ్చుటావిసుండి యు నెందుఁ
గలదుగాని బోదెగట్టులూడ్చు
కక్కురితిని జూడఁగాదేదు నేఁటికై
నదియుఁ జూపెఁ గలిమహాత్మ్యచర్య॥ 31

ఉ. మొరకుల వెంబడించి కొనిమోసపువృత్తికిఁ జొచ్చియెట్లొ ప
ర్భరమగు పొట్టనింపికొనఁ బాల్పడువాండ్రకు దేవుఁడన్ననున్
గురువనినన్ మనమ్మునకు గొంకుదయింపదు చోయలేనియున్
పరమనుకొమ్ము వీరల యపాత్రత లెంచిన సుంత బోదెరో॥ 32

మ. గురుసాహాయ్యము మంచిమార్గమునకుం గొంపోవువౌర్గత్యపుం
దరికీడ్చున్ శనిసాప, మిందుమనయస్తంత్రిజ్ఞులే సాయమున్
శరణంబందిరొ? నీవెఱుంగవె! భవిష్యచ్చర్య ఘాతమ్ము పే
నెఱఁగింపంబదె నీకు నింకవగ పింతేలమ్మ? యో బోదెరో॥ 33

మ. అకలంకుండు శపించె వీరి నన్వృతవ్యాసంగులన్ బ్రహ్మనా
యక గోత్రిప్రవరుండు సూచ్యుఁడవి తానల్లంతనేపోయిదా
ని కథాభాగము లోనిదేయగుఁజుమీ నీతోడివైరమ్ము రి
క్తకళాసూచనకాక యేటిపనికీ కొట్లాటలో బోదెరో॥ 34

చ. పలువురు నాకతాన వరి పండగఁజేసిరికాని యేరు వో
ర్చలమున నన్నుఁ గప్పుటకుఁ బాల్పడినట్టిరులేరు వీండ్రికీ
యలుకకు నేదికారణమటందువొ? విద్దియచెప్పుటొక్కటే
కలదు మఱొండు కారణము గన్పడదెంచను బోదెకాల్వరో? 35

మ సరియౌకారణమొండు చూపుమనుచున్ శంకింతువే, నొందుచే
దరయన్ వత్సరపంచకమ్మయినఁ దానౌనేరికింగావ్యముల్
పరిశీలించి పఠింపునట్టివి శ్రీమణి బాటింపకేయొక్క వ
త్సరమే చెప్పుట గొప్పతప్పగుచుఁ దోఁచందోలు నో బోదెరో॥ 36

చ. చిలుకకుఁ జెప్పినట్టులుగఁ జెప్పిననున్ విసరేమిపాపమో?
కలహపుబీజమున్ జనుపుకర్జమునొప్పిన నైజగౌరవ

స్థలనమటంచుఁ బల్కెదరకారణ విగ్రహమందు నింత వా
రెలమివహించు కారణమదెట్టిదో ? దయ్యమెఱుంగు బోదెరో॥ 37

శా. నీ చైర్త్యాపమునీకు సాజమదియున్నీకుండనీకుంచునా
నీచుల్ పూర్తిగఁ బట్టుపట్టిరికదా ? నేనడ్డగానెంతునో ?
నీ ? చండాలమటంచుఁ బోవిడుతునో ? చెప్పంగదే బోదెరో ?
కాచమ్మెనియుఁ జేయనేరని వృథాకాట్లాట నాకర్హమే॥ 38

మ. అరుదెండంచు సగౌరవమ్ముగ నుపన్యాసార్థమై పిల్వఁగా
సదుదేశస్థుఁడఁగా, నటంచనెడి నేనత్యల్పమౌ దీని కో
సరమై కోర్టునకేగుచో ననుఘనుల్ శంకించుచో వారి నె
క్కరణిన్ దృప్తులఁజేతునంచు మదిలోఁ గంపింతునో బోదెరో॥ 39

మ. పగవన్ దేనికిఁగాని యుండొకఁడు విద్వత్తున్ గడింపంగఁదా
మొగమోటమ్ముగ నాకడన్ మెలఁగునీముష్టుల్ వృథా వాని భా
గ్యగతిన్ దెగ్గించిరి "దీనిచేఁ దమకగత్య భ్రాతృతల్ దప్పుటే
మిగులన్ లాభమటంచునెంచిరౌకదే ? మేత్మెలసున్ బోదెరో॥ 40

ఉ. తమ్మునకన్నలేగు దురితమ్మదివార్యముకాక పోయె రా
రమ్మనినేనుబిల్చినను భ్రాతలకున్ దలకందియో ? మొగ
మ్మెమ్మెయిఁజెల్లకో ? దమవనిచ్చపహింపఁడు వెఱ్ఱివాఁడు నా
నెమ్మదితానెఱుంగఁడె గణింతునె ? [illegible]నువిద్దె చెప్పుదో॥ 41

క. అన్నయ్యా లెంతెచెప్పిన
విన్నయ్యలుకారు తనకు విధిలేదల వా
ర్చన్నట్లు చనరయనితాఁ
జిన్నమొగమ్మగుచుఁ జదువుచెడగొట్టికొనెన్॥ 42

చ. అదియటులుండె రైలుముసుపాదిని బుట్టిన యప్టు పుట్టి య
భ్యుదయమునొందుచున్న నినుబోదెరో ? మాపఁగశక్తి యేరికిన్
గుదురదుకాని దీనికయికోర్టుకుఁ బోవుటకిచ్చలేదు నే
నౌదిగితి నిన్ను ఖూదురినకు నోమఁగనిచ్చితి వృద్ధినొందుమా॥ 43

క. ఇఁక నీ వంకకు నీదు
ర్వ్యకలాత్ములు రారు వచ్చిరేనియు నీలో
నికిఁ ద్రోసి పూడ్చు పెఱుఁగుదు
రెకసెక్కములుడిగి యుందురీపై వైరుల్॥ 44

శా. నీకున్ మంగళమౌత, నీయెడల దుర్నీతిన్ వృథాతాల్చు దు
ర్ధీకుల్ గాంచెడి దుర్గతిన్ దెలుపనెంతే సాక్షివై హాయిగా
నేకాలమ్ము నొసంగుచుండెదవుగా, కీర్తైతనీతోడి పా
టాకల్పమ్ములరారుతన్ బుధుల మెప్పత్యంతమున్ బొందుచున్॥ 45

సమాప్తము

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి. శతావధాని

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ మల్లేశ్వర విజ్ఞప్తి



శా. శ్రీమంతమ్ములు నీకటాక్షములు, నిన్ సేవించువారల్ సదా
సేమమ్ముంగని వృద్ధినందుదురు, మచ్చేష్టల్ వృథాసేయు దు
ర్ధీమంతుల్ తమ మద్విదగ్ధతకు నెంతేదామె భాగ్యాల్ గదా ?
స్వామీ ? సర్వమెఱుంగు నీకిదెనమస్కారంబు మల్లేశ్వరా॥ 1

శా. పిన్నల్ పెద్దలబన్న భేదము లవంబేనిన్ గనన్ రామ సం
పన్నుల్ నాస్తిబుజాస్త్రి పూజ్యము మహాపాపాత్మ కుండిచ్చునా
యన్నమ్మున్ దినకుంట అంకడియ నీకాహార మీయారనో
యన్నా? యెంతల కుండెదో తెలుపుమయ్యా? తండ్రి మల్లేశ్వరా

మ. అవివేకుల్ తినరాని యన్నములు సేయన్ రాని దుష్కృత్యముల్
ఘదిలోనాస్తి, వివేకులన్ గలిపి యీ బువ్వంపు బంతిఁ వెసన్
దవులఁ జేయఁగడంగు చుండిరి కటా? తత్పాపపుంగూడు నీ
కెవరో యెందుల కర్పకుండెయిడెనిస్సీ దేవమల్లేశ్వరా 3

మ. విసముఁ మెక్కిన మేటి పంచెఱుఁగుమన్ విశ్వేశ యద్దానికీ
కసుమాలమ్ము నకెంతయంతర మెుగిన్ గర్భష్ఠముల్ పేర్పిపుకీ
విసముం జూచిన మాత్రఁ దెర్లిపడు దుర్భిక్షంబు ప్రాపించె బల్
వసతుల్ గల్గియు నీకుఁ గర్మగతి దుర్వారంబు మల్లేశ్వరా 4

శా. వేదాభ్యాస పవిత్రకుక్షియగు నుర్వీ దేవునిం గూడ మ
ర్వాదుల్ కొందఱు దీని నెట్లో కుడిపింపన్ జాలయత్నించి త
త్స్వాదుత్వంగుడిపించి రిప్పటికి నేదో రేపో శేషమ్ము సం
పాదింపంగల రిక్కలిపత్రికృతి దెవ్వారడ్డు మల్లేశ్వరా 5

శా. నీ కర్మమ్మది కాలియర్చకుని దుర్నీతిస్థితిన్ జేసియీ
దోకున్ దోకెడుకూడు భక్ష్య మగునట్టుల్ బ్రహ్మ నిర్మించెఁబో
మా కేమి చెడుకూడు మెక్కుటకు ? నేమంటౌత మిక్కూటికి
న్నీకున్ గూడ, సహింపఁగావలయు మా నేరమ్ము మల్లేశ్వరా 6

శా. దాసీదాస పరంతరార్చితులు భూదాయుల్ భవత్సేవకుం
డీ సంపత్తిని నీకెటో నెఱపె నా యేవంపుఁ గైంకర్య మే
తా సైరింపక నీవులో మిణుక నేత్తద్దైన్య మొందబ్బెనే
నీ ? నీ ? దేవునకేనిఁ దప్పదుగదా ? చీకాకు మల్లేశ్వరా 7

మ. పసతుల్ తేండ్లిడినట్టి పుండియును నీ ప్రారబ్ధకర్మానని
నసితే నన్నమెకాక దుర్మలినతా సాంకర్య కైంకర్య పుం
గసయున్ బాల్పడి "కాకమాంస"మనుశ్లోకం బెల్ల నీయంచె తాఁ
బోసఁగెన్ జింతిలఁ బోకుమీ చెడుఁగెటో పోకున్నె మల్లేశ్వరా 8

శా. హేయాన్నంబిపు డబ్బ నేమియగు ? నీ కెన్నేడు లాయెన్ హృదా
ప్యాయమ్మౌ రుచిరాన్నమబ్బ నిజమున్ వాక్రుచ్చు మోదేవ ; యే
సాయాహ్నమ్మున నీకు దీపమిడెనో ? చర్చింపు మింతేల ? నీ
కీయాపత్తెపుడేని దప్పునౌకౌ ? మేమీక్షింప మల్లేశ్వరా 9

శా. కూరల్ పప్పును నేయి యప్పమును రక్తుల్ గూడ భక్షింపనే
సారస్యమ్మును లేని యత్తినమి భక్ష్యమవ్వెని కౌర ? దు
ర్వారంబీ దురవస్థ రాఁపసయింపన్ మాని దేవాలయం
బారన్ జేరినఁగాని మానదౌకౌ ? నీకాఁపుమల్లేశ్వరా 10

శా. దీపం బుంపమి కంత చింతిలమసూ ? దేవా ? భవత్ఫాలనే
త్రోపాంతాగ్నియె వెలుగునప్పునికి నీకాహారపుంబట్ల నే
లోపమ్మున్నది యుష్ణియుంగలవట ల్లుంగుట్లు జిహ్వాస్థలిన్
ద్రొప్పె నిత్యైశ్వర్యయంతనుట సంప్రాప్తించె మల్లేశ్వరా 11

శా. ఏసంబంధముతేని నేస్తువెటుతే నేకూటికే సిగ్గుమై
దోస మ్మెంతగఁ గూర్పెరర్చకుఁడు నీతో నిత్యసంబంధి యే,

యీసోలోగోని హేయమున్ గుడిచి నీ కీయే ముున్ గుద్పునే ?
నీ సత్తన్ మదినమ్మఁడన్న నుడియే నిక్కమ్ము మల్లేశ్వరా 12

శా. గాశ్రిమస్థుల్ నిను దైవమంచెఱిఁగి జంకన్ జొచ్చిరేకాని నీ
సామర్థ్యమ్మది యెంతయో యెఱుఁగుటన్ జంకండు పూజారి యో
సామీ ? లింగము రాయి గాఁదలఁచెనో సత్తా విశేషమ్ము లిం
దేమేనిన్ గలవేని యింతతెగునే యిప్పట్లు మల్లేశ్వరా 13

మ. సుర ద్రాఁగున్ దినునంజుఁడం చొరులకున్ జూపించు సత్యస్వరూ
ప రసమ్మున్ భవదర్చకుం డెఱిఁగియున్ భావమ్ము వంచించి యి
ద్దురితంపుం జెడుకూడు నిన్నుఁ గుడిపెన్ దుర్దర్పసర్పమ్ముచే
గఱవంబడ్డ కతానఁ దానొడలెఱుంగన్ లేమి మల్లేశ్వరా 14

శా. ఎన్నాళ్ళీ చెడుకూటి తో మనెదవో యెన్నాళ్ళు పెంజీఁకటిన్
విన్నాణమ్ము దొరంగి వర్తిలెదవో ? విశ్వేశ ? పాపద్వయం
బెన్నం డున్నిను వీడునో ? సిరులునీ కెప్డబ్బునో ? తెల్పుమో
యన్నా రాయివి కాక దేవుఁడవె నీవైతేని మల్లేశ్వరా 15

శా. నీ నేత్రాగ్నియె నీకు దీపమనుచు న్నేనంటినే కాని యు
ష్ట్రేనినీ గుడికెవ్వఁడేనిఁ జనుచో నిక్కట్టు వాటిల్లు మున్
మూనాస్త్రిం దరుదెంచి రూపఱఁడె ? యోశూలీ ? విచారించుచో
నీ నేత్రాగ్నిని మూయుటే హితమటుల్ నేమింపుమల్లేశ్వరా 16

మ. కనులన్ మూసుక కొంత కాలమెటులో గాఢాంధకారమ్మునన్
మునుకల్ వెట్టుచునుండు మెట్టుల నొయీ ముప్పంతటన్ దీఱునె
ట్లని ప్రశ్నింపకు మర్చకాత్మజుని బాల్యంబంతలో వీదు వా
నిని వర్ధిల్లఁగఁజేసి బాగుపడుటే నీతెల్వి మల్లేశ్వరా 17

మ. నమకమ్మున్ జమకమ్ము సూక్తములు నీనామమ్ములు న్నీదు పెం
డ్లము నామమ్ములు వానికి న్నొదువు మే"లా"యుక్కుయున్ వానిచే
నెమ కంజేయకు కోర్టులన్ మఱఁగుచో నీకొంప మున్గుఁజుమీ
నిముసంబేనియు వాని నేమఱిమియే నీబాగు మల్లేశ్వరా 18

మ. పదిగంటల్ గద ? కోర్టుపై మదియునీ పాదార్చనాసక్తియున్
గుదురంబోవుటయెట్లు ? పండీ, యదినీకుంజూపి, తామెక్కి త
న్నెదురుంజూచెడి పారటీలగమితో నేనాఁటికానాఁడె త
ప్పదు కోర్టేగుట, యర్చకత్వమెటులో వాక్రుచ్చు మల్లేశ్వరా॥ 19

శా. వేతొండూర నివాసమయ్యెడ సెటోవేలేచెనేయన్మ్మ, పైఁ
దీరంగావలెఁ గాల్యముల్ పయిబయల్ దేరన్ వలెన్ రావలెన్
సారాంశమ్ములు పారటీలకెటుకన్ సల్పన్ వలెన్ స్నానమీ
పై రాజన్ వలెఁబొయ్యి కోర్టిచటికిన్ బల్ దవ్వు మల్లేశ్వరా॥ 20

శా. ఏతంబెక్కినవాని ఫక్కిగద? యీయీనీదుపూజాభరం
బీతంటాలును సంధ్యలోనయిన సత్కృత్యమ్ములున్ వంటయుం
బ్రీతిన్నీదు సమర్చనమ్ము నెటుప్రాప్తించున్ మనుష్యుండె కా
దో తండ్రీ ? యిని దేవుఁడే నెటులు సేయుం దెల్పు మల్లేశ్వరా॥ 21

మ. అనృతమ్ముల్ మునుసంత చెప్పినవి తానానాఁడు రువ్విచ్చి సా
క్షిని నిర్భీకు నొనర్పఁగావలయుఁబైఁ "గేసెట్టులన్ గెల్తు మం
చును బార్టీనుసికొల్పఁగావలయుఁ బైసొమ్మెంతయో కొంత క
ర్చున కంచున్ గొనఁగావలెన్ జనవలెన్ జూ॰కోర్టు మల్లేశ్వరా॥ 22

శా. ఎన్నో సృష్టులు సేయఁగావలయు నెన్నోఁగల్పనల్ సత్యమే"
యన్నట్టుల్ లగియింపఁ గావలయు నీయాయాసపుంగోలతో
నిన్నున్ నన్నునుజూచువారెవరు ? మన్నింపన్ భజింపన్ యజిం
పన్నైవేద్యమొసంగ వీలెటుఘటింప న్వచ్చు మల్లేశ్వరా॥ 23

మ. అనృతంబాడని గొల్లబోయలకసత్య ప్రీతిగల్పించి వి
ప్రునియీనామకుఁ గొక్కువెట్టు సుఖపుల్ బోధించియాభూమిలో
దనకున్ భాగమునేర్పరించికొని యీతండిప్డు వర్తించు వ
ర్తనకు న్నీధగునర్చనక్రియకు నే తంపెట్టు మల్లేశ్వరా॥ 24

మ. తనపూర్వుల్ నినుఁ బూజసేసిరికదా ? తచ్ఛుద్ధచారిత్రముల్
కనివిన్నట్టిఁడె యీతఁడిప్డిటులు నిన్ గాటించు చున్నాఁడె టో

ధనమార్జించునకాని యుక్తముగఁదద్ద్రవ్యమ్ము వెచ్చింపమిన్
మనుకాలమ్మునరాదు నీదయిన యమ్మాన్యమ్ము మల్లేశ్వరా॥ 25

మ. కొడుకున్ దానును రెండుపొట్ట, లిఁకఁదక్కం గల్గువారెవ్వరున్
గుడువన్ గూటికిలేరుగేహమున, నీకుం బెట్టితానెంత ని
ల్కడగావర్తిలవచ్చు ? నప్పులవృథాగా బెంచఁగానేల నీ
మడిమాన్యమ్ములమీద నీతనికిస్వామ్యమ్మున్నె మల్లేశ్వరా॥ 26

శా. పండల్ పూర్వపులెక్క, నేఁడనిన వేల్వచ్చున్ జూసి ? భూమిపైఁ
జందాలున్నవికొన్ని, నీవెఱుఁగవే ? శశ్వత్సమారాధనల్
నందాదీపములేమి కేకతము ? మానాఁడిట్లు పాడయ్యె నీ
చందమ్మియ్యది మాదులోపమెయగున్ సర్వమ్ము మల్లేశ్వరా 27

శా. మాలోపమ్మనుకోకు శక్తికొలఁదిం బల్మారుయత్నించియే
వీలుంగానకమిన్నకుంటి, మతఁడు ద్వేలుండు గ్రామమ్ములో
మాలోమాకనుకూలభావపుది సామాన్యంబు, నీవింతయుఞ్
నీలోఁ జాలనెఱింగి సైఁపగదె మానేరమ్ము మల్లేశ్వరా॥ 28

శా. దేవస్థానపు రూలుసున్నదఁటయో దేవా ? తదాధారపున్
జేవన్నీదగునర్చకుండు వినయశ్రీదాల్చునేమో ? మహీ
దేవుల్లోనగు గ్రామపుంబ్రజలునీ తిండిన్ విచారింపరే
జావో పాపము ? మెక్కుచుంటివదియున్ స్వల్పంబుమల్లేశ్వరా॥ 28

మ. పరమేకొన్ని యిహమ్మెకొన్నియుభయప్రాప్తిన్ బ్రసాదించునే
చరణారాధన మట్టిదీనికొఱకే జన్మించు ప్రాణుల్ మహ
త్తర సౌభాగ్యనిధుల్ గదా ? సుఖముగాఁద్వత్సేవ గావించి స్వ
ర్గరమన్ బొందక యర్చకుల్ చెడుట ఘోరంబయ్యె? మల్లేశ్వరా॥ 30

మ. ఒకచో నేగఁబనేమి ? యర్చకునకేయూరేమి యైనన్ భవ
త్ప్రకటాంఘ్రిద్వయపూజకున్ వలయు తత్తత్పత్రపుష్పాది వ
స్తుకదంబమ్మును సేకరించు కొనుచుఞ్ శుద్ధాత్ముఁడై నిన్నుఁ బా
యక వర్తించుట భుక్తిముక్తు లిడుఁగాదా? తండ్రి? మల్లేశ్వరా॥ 31

మ. తన యంతన్నినుఁ గొల్వకున్న నితరుల్ తన్నుందురం చేనినిన్
దినమున్ గొల్చెడి యర్చకాన్వయమునందే పుట్టి పెంపొందఁ గాం
చిన వారిణిన్ సుకృతాత్ముఁగాఁ దలఁచు మత్సిద్ధాంతముం గూడ నో
యనఘా నీదగు నర్చకుండు మననీఁడయ్యయ్యో మల్లేశ్వరా॥ 32

మ. ప్రతిబంధమ్మనసేని నీదగు సమర్చన్నిత్యమున్ సల్పువాఁ
డతి న్యాత్ముఁడటన్న నానుడికిదేవా? వ్యాసముఖ్యుల్ మహా
యతులాధారము దేవదేవునెటులే నర్చించుచే పుణ్యుఁడౌ
గతి యట్లబ్బియుఁ జేయకుండుటది దుఃఖప్రాప్తి మల్లేశ్వరా॥ 33

మ. "ధనముంగొంచుఁ బరార్థమర్చనమునింద్య"మ్మంచు శాస్త్రమ్ము లా
డును గాకంచులకొప్పరా దొసులనెట్లో పొట్టకై కొల్చు టె
ప్పనికో తక్కినఁ దప్పరాదుకద? యప్పాటున్ భవత్సేవయుం
దొనరింపందగువాఁడు ధన్యుఁడననొప్పో? తప్పో? మల్లేశ్వరా॥ 34

మ. క్షమసేవృత్తిలుఁ జేయనెవ్వనికి సంసారంబు దుస్సాధమా
శ్రమ మన్యత్రినొనర్చుకన్న భవదర్చన్ సల్పఁ జేకూరఁ గీ
ర్థముస్వార్థమ్మునుగూడి వచ్చుటగదా? తద్భాగ్యమబ్బంగన
క్రమమార్గమ్ములు ద్రొక్కుటెంతయును దౌర్మార్గ్యంబుమల్లేశ్వరా॥

మ. ఫలముల్ లోనగు సర్వవస్తువులు దేవప్రీతికై యుత్తమం
బులుగాఁ గైకొని యాత్మసన్నిధికి భూపుల్ బీదలుంగూడ న
గ్గలపున్ భక్తినిదెచ్చియిచ్చెదరు భాగ్యంబింతకన్నన్ మను
ష్యులలో నెవ్వనికున్న? దర్చకుఁడు ధన్యుండోయి మల్లేశ్వరా॥ 36

మ. ధరవాణిజ్యము లాభకారియనుచున్ దక్షుల్ ప్రశంసింతురం
దరయన్నిత్యము సత్యహాని ప్రతివాక్యమ్మందుఁ గన్పట్టుటన్
బరమేకాక యిహమ్ముఁ గూడఁ జెడుదేవా? నీదు పాదార్చనా
ధరమేయుక్తమొ? వర్తకంబె వరమో? వాక్రుచ్చు మల్లేశ్వరా॥ 37

మ. హలవృత్తిన్ గయికొందమన్నను బహుప్రాణియుల్ పశుల్ నేప్కరా
స్థలముల్ గాఁ జెగుటబ్బు పిప్రిలకుఁ దద్వ్యాపారమాపత్సమా

కలనీయమ్మని చెప్పఁడే మనువు త్వత్కైంకర్యముం బోలనీ
యిలలో నొండొకవృత్తి యెయ్యెడల లేనేలేమ మల్లేశ్వరా. 38

మ. నృపసేవాపరులొందు కష్టములు వేఱే చెప్పఁగానేల? ఐల్
త్రిపవుట్టున్ స్మరియించుమాత్ర: "నసిధారావ్రతాన" మ్మంచుమున్
వ్యపదేశింపరె? వందితుల్, సుఖము త్వత్పాదార్చకత్వంబె? యే
యపకారమ్మునులేదు దీనఁ, బరమో? ప్రాప్తించు మల్లేశ్వరా॥ 39

మ. ఇఁక భిక్షాటనవృత్తి: దోషమొకఁడే నీ వృత్తిలో లేద పో
ట్టకునప్పప్పటి కంతొ యింతొ సమకూడన్ గల్గు నిద్దాన: ని
లుకు సంపాదన గావుసబ్బదిదియున్ భాపత్కపాప ద్వాయా
ర్చకు వృత్తిన్ గడవంగ నేర దతినిస్స్వంబౌట మల్లేశ్వరా॥ 40

మ. కలవింకన్ బలువృత్తులెయ్యవియు నీ కైంకర్యముం బోల వీ
ఫలవంతమ్మగు వృత్తి పాల్పడియుఁ దాపవ్యాపృతింబోవు ని
ష్ఫలులం జూచి విచారమందవలెనో? సంతోషముం బొందఁగా
వలెనో? యిందెది యుక్తమో? నుడువుమప్పా? మాకు మల్లేశ్వరా॥

మ. సుకృతమ్మున్ దురితమ్మనల్పెడి మనుష్యున్ జూచి యామోదమున్
బ్రకటింపన్ బ్రకటించువాని కచటన్ భాగమ్మ చేకూఱు. న
ర్చక నుత్సేకము మాకటుండ నది దుస్స్వాపమ్మ నీకేని, యం
దుకు నామోదములేమి తెల్పుటకె యీ దుఃఖమ్ము మల్లేశ్వరా॥ 42

శా. గ్రామార్థమ్మయిరావె! నీకిట గుడిన్ గట్టించినాట్బ్రాహ్మరో
స్వామీ: వీరినిమిత్తమర్చకుఁడు నేర్పాటయ్యెఁడిల్లోపమీ
గ్రామమ్మున్ ఘటియించుఁ, గావున నుపేక్షన్ జూపఁగారాదు నీ
కో: మా యూరననేల? గుళ్లె కఱవా? కోట్లుండు మల్లేశ్వరా॥ 43

శా. మా కోసమ్మిట నివు కట్టువడి గ్రామస్థుల్ విచారింపమిన్
"గాకల్లోక" పు టర్థమున్ గుడుచుచుఞ్ గష్టించుచున్నావు నీ
కో: కాశీముఖదివ్యతీర్థములు పెక్కుల్ మాకు నీవేంచో
నీ కుగ్రామనివాసమో? భరము గాదే దేవ మల్లేశ్వరా॥ 44

శా. నీ కప్పుల్ గడుఁ బ్రీతిపాత్రములగు న్నీయర్చకుం డెట్టులో
నీ కవ్వానిని గట్టి పెట్టెఁగద ? వీనిం బట్టి యేనిన్ సదా
యీ కుగ్రామ నివాసమర్హ మగునీ కిందెందు కేనుండినన్
మీ కామాత్రపుచాలు నయ్యదియ కామ్యంబయ్యె మల్లేశ్వరా॥ 45

మ. సకలంకుండగు చంద్రు నంకమును నిష్కాసించి తల్లేఖహే
లకునై శీర్షమునన్ ధరించెడి ధవల్లాలిత్య మీ నీడున
ర్చకు నెట్లో లలితుం బొనర్చి తగునర్చల్ పొందఁగాలేదె ? దు
శ్చకమే ? నీ, కిటులెందుకో గద ! యుపేక్షాబుద్ధి మల్లేశ్వరా 46

శా. కాలన్ బోయెడి దాని నెత్తి నిడుకోఁ గానేల ? యద్దానిచేఁ
బాలంబోలుపలానకు న్నలు పనల్పం బూన్పఁగానేల ? యీ
గోలం జిక్కి పవిత్రులన్ జెఱుప దుష్కోపానయు శ్శీల పుం
జాళై బాగఱనేల ? నీవెఱుఁగుచో వాక్రుచ్చు మల్లేశ్వరా 47

మ. కలికాల మ్మిది దేవతా మహిమమే కానన్య మేకాదుదు
ర్బల మిప్పట్టున నట్టిచో స్వకుల మర్యాదల్ చ్యుతిం దాల్చుచు
ర్మలినత్వప్రతిపాదకమ్ములగు కర్జమ్ముల్ వృథాఽహంకృతిన్
బలవంతమ్ముగ సల్పి నిన్నుచటఁ గల్పన్ మేలె ? మల్లేశ్వరా॥ 48

మ. కుల భేదమ్ములు లేని నీకుఁ గుల సంకోచమ్ము బ్రహ్మజ్ఞ ప
ద్యాలె కల్పించిరి సమ్మతించితివి దుర్దోషమ్ము నీకెప్పుడే
లలి నంగీకృతమయ్యె ? నీవా కయెడన్ లక్షింపకున్నన్ విధి
జ్ఞులు విద్వాంసులు నిన్ను నొప్పెదరె పూజ్యుండంచు మల్లేశ్వరా॥ 49

శా. కౌళాచార పురస్సరమ్ముగను సంస్కారుల్ నిసుఁగ నిల్పిరే
నీ లోపమ్మది కొంత సహ్యమగుఁ గానీ యట్లు నీయున్కి సం
బాళింపంబడ వాగమోక్త విధి నీప్రాణ ప్రతిష్ఠాది కం
బోలిం గ్రియట మాకు నీకు నొకచే యోగమ్ము మల్లేశ్వరా 50

శా. సారా చారులు గేస్తురెట్లొ అటులే సర్వమ్ము నీవెందునా
చారమ్మున్ గయికోఁదగున్ మిగుల విస్తారమ్ముతో నేమి ? సం

సారం బేగతి విప్రుఁడీఁడునా పరిశుద్ధమ్మైన నేమమ్ముతో
నారీతిన్ గయికోని నీకు నగుఁ బ్రియశ్చిత్తి మల్లేశ్వరా॥ 51

మ అదె సంప్రోక్షణ మంత్రము పెట్టి లిపు డయ్యాచారమున్ సల్పు త
ప్పిదము న్నీదగు నర్చకుండు సినుఁగుచెన్ దానికి న్నీకు న
మ్మదమో? కాదో? యొకింత తెల్పఁదగు నమ్మాలిన్యమున్నైఁతుపే
నెదియు న్నీయెసళక్తి లేమి విదితంబేయౌను మల్లేశ్వరా॥ 52

మ. ఎదియుం దెల్పక మిన్నకున్నయెడ నీవీ యర్చనన్ రోసి యీ
పదమున్ వీడి మతొక్కచోటి కిటమున్ బ్రస్థానమున్ జేసిన
న్లైద నూహించెద మట్టులీ వటుగు మాటేనిక్కమే యైననీ
కెమనై నీఋణదాత లడ్డికొని పోసిరయ్య? మల్లేశ్వరా 53

శా. మాలిన్యమ్మున కొప్పఁజాలని యెడన్ మాకోపికన్ రాక నీ
వీరాతత్త్వ మహత్త్వ మర్చకున కోలిన్ దెల్పి శుద్ధాత్ముఁగాఁ
బాలింపన్ బ్రియతింపు మూరక యెటో పాటంగనుం కింపనిన్
జాలన్ రోయుదు రుత్తమప్రభులు దెసల్ చాటించిమల్లేశ్వరా 54

మ. భవదీ యార్చకునండ నొందొకఁడు పాప వ్యాపృతుండుండి దు
ర్వ్యవసాయమ్మునకున్ గడంగు కతనన్ గ్రామస్థితుల్ నేయు స
ద్వ్యవసాయమ్ము ఫలింపకున్నయది యెట్లా ఛాపమేదేవ నీ?
యుపయోగమ్మునకు న్నిమిత్త మిదినీపాలింపు మల్లేశ్వరా 55

శా. ఈ దుష్టాత్మునకున్ గురుండనినఁ గానీ చేపుఁడంచన్నఁగా
నీ దోషంబని కాని యన్యమని కానీచేయు దుష్ప్రాపుసుం
బేదోలోఁగొని గ్రామమున్ జెఱుపఁ దానెల్లప్పుడున్ దుష్కృతుల్
కావన్నన్ వినకే యొనర్పఁ గడఁగన్ గష్టించి మల్లేశ్వరా 56

మ. గత మందిచ్చిన భూమి దానమునకున్ గల్పించు నభ్యంతర
స్థితి గ్రామమ్మున నున్న పంతులపయిన్ ద్వేషించుఁబైశున్యమున్
వితగాఁ గైకొని దుష్టులన్ బుధులపై ద్వేషించఁగాఁ జేయుదు
ర్మతి యువ్వాఁడె త్వదర్చకున్ జెఱపఁ జేరకాదీని మల్లేశ్వరా 57

శా. గ్రామమ్మందలి మాల మాదిగలనున్ గష్టాత్ముఁ డీతం డటం
చేమేనిన్ దనుఁ జెప్పుకోఁదగిన దుష్కృత్యమ్ములన్ నిత్యముఁ
ధీమందుం దలవాఁడౌ నర్చు గురువున్ దేవుండు లేఁడల్లదు
శ్రీమూర్ధన్యున కీతఁ డేయడఁచె నీశ్రీయుష్మ మల్లేశ్వరా 58

మ. ఉపకారుల్ నృపుతోడఁ జెప్పియెుమ తెట్లో నీకు దీపాదికం
బుపపన్నం బొనరింప నెంచునెడ నీయోగ్యేతరుం డెట్టులో
యపసాక్ష్యమ్మున కార్తిభృత్య సహితుండై సిద్ధ మౌనంచు గ్రా
మపుఁ బెద్దల్ వెస గీయుచుండి రెటులో మన్నింపుమల్లేశ్వరా 59

మ. కుల విప్రుండగు నొజ్జకన్నులెవరో గోదాన మీయంగనీ
చలచిత్తుండల భూమి లాగి కొను నిచ్చల్ పుట్టఁగాఁ జేసెఫీ
మలినుం డిట్టిడు నీటుసర్పకున కుంబట్టౌటచే నూరిపె
ద్దలు నీదుర్గతిఁ బాపలేరయిరి తథ్యంబింత మల్లేశ్వరా 60

మ. హలవృత్తి గ్రహణంబె విప్రులకుఁ దానాపత్తునన్ ధర్మమై
వెలయన్ దానిన లాక యుచ్చెనఁటి నిర్వీడాత్ముఁడైవాతిగు
ట్టలు కూలింగొని తోలఁగా దొడఁగెఁ గట్టా ? నీమి వాహమ్ములం
గలయంగట్టిన బండితో నెటుఁగుదేకా ?నీవు మల్లేశ్వరా 61

మ. కుల మర్యాద నడంచు పాపమునకున్ లోపమ్ముమైఁబోయి బొం
కులు నోరాడఁగఁ గూసి వంశ గురు నెగ్గల్ పల్కుచై నెన్ని యో
కలుషమ్మున్ పొనరించు కారణము నంగాకున్న నివ్వానికిన్
వెలమోమై కళతప్ప నేమిటికయో ? విశ్వేశ ? మల్లేశ్వరా 62

శా. వేదద్వేషము విప్రవైరము దయావిద్వేషమున్ నిత్యము
ద్వాద ప్రీతి మదద్యు మాద్యతియు మద్యాపారంభ సంసక్తి దు
ర్బోధ దౌర్జన్యములోను గాఁగలుగు నిర్వీడుండు నీలెంకకున్
దా దైవమ్మును నీకుఁ దెచ్చెనయయో దైన్యమ్ము మల్లేశ్వరా 63

శా. వాఁడున్ వీడును నిర్పురేఁడునగుటన్ వాయ్వగ్ని సంయోగమై
మూడెన్ ముప్పుత్వదాలయమ్మునకు, నిమ్మార్గాగ్రణుల్ నిత్యమున్

గూడన్ గోష్ఠులయందె మ్రగ్గెదరు నీకున్ వంట పూటింటనే
కూడీపై ఘటియించు నేమొ యని నాకుందోఁచు మల్లేశ్వరా॥ 64

మ. గురువున్ దైవము లేని ఖంత హతభాగ్యుండిప్పుడో యింకనో
నరకంపుం దెరువంటి పోఁడిగిన యుస్మత్తుండు నీ వెంకటున్
బరమాప్తుం డలవాని పిమ్మటను నీ పాదార్చకత్వంబొగిన్
జరుగున్నీ కెఱుఁగంగఁ జెప్పితినిదే సత్యమ్ము మల్లేశ్వరా॥ 65

మ. అలవాఁ డెప్పుడు పోయి నాకౌదవుని య్యార్తిన్ దొలంగించునో?
యెలమిన్ జెప్పుమటందువేని వినుమో యీశాన ? సర్వజ్ఞతా
కలనంబుండియు నన్నుఁగోరితివిగా ? కానిమ్ము పాపమ్ములన్
నలుపంగిననబూదేబె కుండునె ? భవిష్యత్స్వత్త మల్లేశ్వరా॥ 66

మ. ఎవఁడున్ దానొనరించు కర్మముబచే నే పొందుటల్ సృష్టటల్
ఘుశ్రీపమేనన్ మనఖంత నేయు పనులెందున్ దుంటరుల్ నేయు స
ట్టివిగా నున్నవి వీనినెల్లరును దిట్లేతిట్టుచున్నారు స
ర్వ విధాలన్ జెడుకాలమే దరికొగిన్ రాఁబోలు మల్లేశ్వరా॥ 67

శా. వావిన్ జూడని వర్తనంబు కులవిప్రిద్వేషమున్ దేశికున్
భూవంద్యున్ దురితమ్ములాడుటయు దుర్బోఫల్ దురాచారులన్
సావాసమ్మునఁ జేరఁదీయుట మొదల్ చండాల దుర్వృత్తియున్
దేవా ? నీకుపకారమున్ సలుపనున్నే? తెల్పు మల్లేశ్వరా॥ 68

మ. కులవిద్యల్ నశియించుచున్నవని పాశ్చాత్ల్ వానికై నేయు న
ల్లలితంపుంగృషి నడ్డుపెట్టుటకు నిర్లజ్జుండు దుశ్శీలుఁడై
"కలికాల"మ్మని యెల్లరుందెగడ దుష్కర్మమ్మొకండూనె ని
ప్పలుగాకిన్ జెడఁదీయు నీప్పని యొనర్పంబోదు మల్లేశ్వరా॥ 69

శా. నీయాంతర్యమెఱుంగనో ! యెఱుఁగదో ! నీరెంకమాటంకయున్
మాయావ్యాపృతిఁ దప్పు "కేసు" నొకఁడున్ మామీఁదనృష్టించిర
త్యాయాసమ్మున సత్యమి ష్టపికృతి వ్యాపారికిం దెల్పి నీ
పీయుదిగ్రిక్తులఁ గూలఁదోగ్రియపె మదిమ్మెదంగ మల్లేశ్వరా 70

మ. అటుకావింపవయేని యాచెనఁటు లన్యాయంపు దుష్కల్పనల్
ఘటనానైపుణి నెట్టులోపొలిపి యేకర్తనకున్ బోక దూ
రటకుల్ గాక మెలంగు గేస్తులను మేరన్ మీఱి బాధింతు రె
ప్పటికిన్; దేవరచిత్తమాపయి విధింపన్ జాల మల్లేశ్వరా॥ 71

శా. దొంగల్ బాధకులో గృహస్థతతికిన్ దుష్కల్పనానల్ప వా
గ్భంగున్ బాధకులో గణించినయెడన్ స్పష్టమ్మగున్, మేక వ
న్నెంగన్పట్టు పులిన్ కుకల్పకులు నీనేర్పెల్ల నిద్రోహులన్
గుర్తింగం జేసెడి పట్లనే నెఱపి మ్రొక్కుకొన్ గొప్ప మల్లేశ్వరా॥ 72

శా. పూజార్హున్ వృథగా గురున్ దెగడి తాఁబూజారి నర్పించుటన్
తేజశ్శూన్యతకాక యేమగునొ ? మాదేబన్న గుర్తింపఁబోఁ
డీజాడ్యమ్మది వెంటనేయెపిరె నిందేమౌనొ ? మాజాల్మెటు
ల్స్త్రీజాత్యున్నతి కానవీయదియయో ? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 73

మ. పగటన్ దల్లియు రాత్రి భార్యయుగ నిష్పాపుండు వర్తించుదు
ర్భగుఁడివ్వానికి భార్యయేమి కతమో ? ప్రాప్తించె సచ్ఛీల యా
సుగుణంపుం గని కార్తి గల్గుననినీచున్ వీని భక్షింపఁగాఁ
దెగఁ దక్కాలుడు గూడ సత్యమిదివో దేవేశ మల్లేశ్వరా 74

శా. భార్యాయోగ్యత గల్గియుఞ్ జెడిన దుష్ప్రారంభులన్ మున్నుదు
శ్చర్యా ధుర్యుల నెందఱఞ్ గనము దోస్సారమ్ము మైఁబాపపుం
గార్యమ్మున్ బొనరింప భార్య తెటులాఁ గన్నెత్తి రుచిర్త్తదు
ర్మర్యాదాకలనంబుతేరినయినన్ మన్నించు మల్లేశ్వరా 75

శా. కోపం బుద్దెనయఞ్ దినన్ మరిగి యాకష్ట ప్రచారుండు దు
ర్లాపుండెట్టులొ పిల్లినెల్కపయినెల్కన్ బిల్లిపైఁబెట్టి తా
నేపాట్లో పడుచుండు వీని కుచరంబేసర్వమున్ ధార్మికుల్
శాపాస్త్రుల్ గని వీనిపైఁప రెవరో శాసింతురి మల్లేశ్వరా॥ 76

శా. నేనే సత్కవినేని వాఁడు ఖలుఁడేనిఞ్ నేను దక్షేమసం
శాసం బెంతునయేని వాఁడు నసుఁ దద్దన్ ఛిద్కలం బెట్టఁగా

లో నూహించునయేని నీ పఖిల మాలోకింతువేనిన్ దద
జ్ఞాన మ్మెల్లను బట్టబైటఁబడు నిక్క మ్మింత మల్లేశ్వరా॥ 77

శా. దేవాగారపుమేలు గోరి మది యత్నింతున్ ద్విజన్మాగ్ర్యవి
ద్యావిర్భూతికినై యతింతు నుభయ మ్మవ్వాఁడు ద్వేషించు నీ
ద్వైవిధ్యమ్మున నెరికిన్ జయము సంప్రాప్తించునో? చూత మో
దేవా? ధర్మమెహా జయింపనుతె నెందేఁ గాని మల్లేశ్వరా॥ 78

మ. గురులన్ హేళనసేఁత సత్కృతుల కెగ్గుల్ పన్ను నారోఁత త
స్కరులన్ లాలనసేఁత పిట్ట కతిరిక్తం బైన పెన్మోఁత యీ
కొఱకున్ మాలినపేరికున్ సహజ మై ఘూర్ణిల్లు నీ శుంఠ దే
వరయుచ్చైర్గతి కంతరాయ మిది సంబాళింపు మల్లేశ్వరా॥ 79

మ. ఎఱతోలున్ మిడిగ్రుడ్లు పెల్లమొగ మై యే తెల్వియున్ లేక న
ల్పురలోనన్ నగుఁబాటుగా మెలఁగుచున్ లో నైన శంకింపకే
పరిహాసమ్మున కేని దాల్పడు పఱువాఱియుండు నీ వెంకకున్
బరమాప్తుండఁట? యేమి లోప మిఁక నప్పా? నీకు మల్లేశ్వరా॥ 80

శా. నీకున్ మిత్రుఁడు గుహ్యకేశుఁడు గదా? నీవెంకకున్ దత్పద
ప్రాకట్యమ్మున కర్హుఁ డైన యతఁడే ప్రాప్తించె మిత్రుండు మీ
యేకత్వ మ్మటువంటి దౌ కతన నీ కిష్టుండె నీ వెంక; వాఁ
డేకాలుష్యము పెట్టినన్ సయిచె దీ విట్లౌట మల్లేశ్వరా॥ 81

శా. నా యత్నంబు త్వదర్థ మిక్కృతికి విఘ్న మ్మెట్టులో కూర్చ ని
మ్మాయాపుల్ ప్రియతింతురు చోరజనులన్ మన్నింతు రెంతేని నీ
శ్రీయం చే గతి నిల్చునో? యెఱుగనీ చిత్తమ్ము దుర్జ్ఞేయ మా
మ్నాయధ్యేయ? యుపేక్ష కూడదు సుమీ నాపట్ల మల్లేశ్వరా॥ 82

శా. దొంగల్ వంచకులున్ బృథగ్విధగతిన్ ద్రోహమ్ము నూహ్యాల్పు చో
భంగమ్మెంతగ నుండు దొంగదొరలు ప్రాపై ద్రోహముల్ సేయుచో
భంగ మ్మెట్టిదొ నీ వెఱుంగవె? పృథ్వీపాలమ్ములటల్ కూడునే?
పొంగాలింపఁగదయ్య? పేంద్రదురహమ్ముం బ్రమించి మల్లేశ్వరా॥ 83

మ. కుజనున్ బొంగడఁగించునట్టిపని నీకున్ గష్ట మేపాటి ద
య్య ? జడత్వమ్మున వాఁడు దర్పివ్వికొను గర్తానీక మం దొక్కటన్
వృజినాత్మున్ వెసబూడ్చిపెట్టుపనియున్ వేఁగొక్క నీమాంద్యమా
ర్యజనుల్ మెచ్చరు నిద్రమేల్కొనుముశీఘ్రమ్మింక మల్లేశ్వరా॥ 84

మ. ఒకచోఁ జిక్కియె యుండె నింక నొకచో నున్నాఁడు చిక్కంగ నీ
వికలాత్మం దధికారిచేత నిజమున్ వీక్షింపఁగా జేయు మీ
చకితుడంతటఁ గొంత చక్కఁబడు నీ చండాలుఁ జేరేచుపా
తకునున్మత్తత నే నడంతు నటుమీఁదన్ దేవ మల్లేశ్వరా॥ 85

శా. నీ వం తీమరితాత్ముఁ డా హతుఁడో నీ భార్య యార్యామహా
దేవీభాగము, దున్నరక్కసున కాన్నపుండు దీ టౌను నా
కై విశ్వేశ్వరి వానిగోత నిడు నే నాయమ్మహార్యక్షమం
చీ వే చక్క నెఱుంగు దింకఁ గొద వేమీ ? తండ్రి మల్లేశ్వరా॥ 86

మ. అధికారస్థులయందు నెందు భవదీయాంశమ్ము వర్తిల్లు స
త్పథమార్గుల్ పొనరించుకల్పన లసత్యం బెల్ల నల్లంతఁ ద
ద్విధసన్మానసదర్పణమ్ములమెడన్ దోఁచున్ ధ్రువం బన్న య
వ్విధ మిప్పట్టునఁ దేల్పఁగావలయు నో విశ్వేశ మల్లేశ్వరా॥ 87

శా॥ నీ యున్కిన్ మఱి పాఠశాలయునికి న్నీ లెంక మాకుంకయున్
రోయంబూనుట తెల్లమయ్యె నయయో ? రుద్రుండవై దుర్మద
స్వాయద్దుష్కృతుల న్నివారణ మొనర్పన్ గొంకుచున్నాఁడ వి
ట్లైయైనన్ గృహమేధివర్గమున కేవీ ? దారి మల్లేశ్వరా॥ 88

మ. జముఁ డున్నాఁ డని యీ నృశంసకులు లేశ మ్మేనియున్ గొంక ర
క్రిమమార్గమ్ములు పెల్లు ద్రొక్కెదరు సిగ్గా ? లేదు నిష్ఠీవముల్
తమ మోరన్ బదిమందియున్ గురియ ఖేదం బన్నదా? లేద యీ
కుమతుల్ పుట్టినపుట్టు వెట్టిదియొ? కన్గోవయ్య మల్లేశ్వరా॥ 89

మ. కొమరున్ రోగవిముక్తుఁ జేయుమని మ్రొక్కుల్ మ్రొక్కితిన్నీదుపెం
ద్లము కామేశ్వరి కా జగజ్జననియున్ నాకోర్కి పూరించె గాని

మమహారోగము వాపు మం చిపుడు నిం(బ్రార్థించెద న్నీమ చి
త్తము నాథాస్వము పిమ్మటన్ దగదు మాంద్య మ్మిందు మల్లేశ్వరా.

మ. ఖలరా గాని మహాచి గాని మతి రోగా లేవియేఁ గాని యీ
ఖలచిత్తుల్ బలె గ్రామమున్ జెఱుప పీ కర్మశ్వపాకద్వయిన్
జలమాటింపఁగదయ్య ? గేస్తులకు నాపత్కారి లీ తుంటరుల్
నిలు వెల్లన్ విషపుంజముల్ నెఱపుమీ ? నీ చూపు మల్లేశ్వరా॥ 91

శా. గ్రామక్షేమముఁ గోరి తేని ఖలులన్ గావింపుమీ శిష్ట నీ
క్షేమాత్రిమ్మను దాన రక్తి యది లేనేలేనిచో లేశమున్
మా మొట్టల్ పనిసేయ వట్లని యెటో మాంద్యమ్మ మే మూనరా
దేమో నీ దయ గ్రామరక్షణము నీదే తండ్రి మల్లేశ్వరా॥ 92

మ. ఎపుడు న్నాకుసిగొల్పె దేమి కితమో ? యీలాటినీచాత్మలన్
గపటస్వాంతులు వాండ్రు స్వీయ మగుతత్కారమ్ములం బట్టి ని
ష్పపయిన్ దూఁకెడిపుర్వులట్ల వృథగాఁ బొంగాటి నిష్కారణ
ప్కమపకీర్తిన్ ఘటియింత్రు జాతకఫలంబా యిద్ది మల్లేశ్వరా॥ 93

మ. కలహంబే ఘటియింపఁబోకు మది శక్యం బౌనె ? నా కన్న నీ
చులఁతోఁ గూర్పకు మయ్య? మ్రొక్కెదను సంశుద్ధాత్మలౌవారితోఁ
గలహం బబ్బిన నబ్బుఁ గా కదియుఁ దాఁ గల్పింపఁగా నేర్పు ని
ర్మలకీర్తిన్ నిను వేఁడు టీయొకటి సుమ్మా? దేవ? మల్లేశ్వరా॥ 94

శా. నీచంబో ఘనమో మతెట్టి దయినన్ పీయూర జన్మించె నీ
కాచమ్మెల్లరు దీని వజ్రిఘని రేకర్మానసోలోకం, లీ
పేచీకోరు లసూయకున్ గడఁగుచుం బెంపాఱుటల్ పూర్తిగాఁ
బోఁచెన్ దీనికి మానసంబు మిగులన్ దుఃఖించు మల్లేశ్వరా॥ 95

శా. గవ్వన్ జేయని వాండ్రితోడ నఁట ? వెంకన్నఁట ? తానంట? యీ
చివ్వన్ జేసెడి నంట ? పాత్రిజ్ఞులకు పీ చెయ్యుల్ రుచిం గొల్పునే?
నవ్వన్ జల్పెదుఁ గాక పిండ్రినెటులో నాపైకి రప్పించి యీ
అవ్వన్ అట్టును గూర్చుదేపరడి నేరం బయ్య మల్లేశ్వరా॥ 96

శా. ఊరుం బేరును లేనిశుంఠఁ బరమాయోగ్యున్ జడున్ వీనినేఁ
గారాగారము సేర్పు బొంచెఁగడకున్ గక్షమ్ము నందున్ రికా
ర్డారన్ బెట్టుక కోర్టు కెక్కునెడ మర్యాదాపరుల్ సూచి "సీ
సీ" రావమ్ము లొనర్తు" రంచు మదిలోఁ జింతింతు మల్లేశ్వరా॥ 279

మ. అయయో? నిత్యము గంగరావులె గృహంబై పంటపూటిండుతే
శయ సీయస్థలు లన్న శాలలును సైసాక్ష్యంబె కూడౌ దురా
శయుఁ దేమేని యొనర్చుఁగాక తనకున్ శాంతంబె కర్తవ్య మం
చు యశోర్థుల్ విధియింతురంచు మదిఁ దోఁచున్నాను మల్లేశ్వరా॥

శా. కాదే నిన్నుఁ గూర్చి వీఁడు చెడుగుం గర్జమ్ములం జేసినన్
వామల్ వైచినఁ జేమమేసినను దుర్వ్యాహారముల్ గిల్కినన్
బోదెన్ బూడ్చిన నేమిచేసిన "నదేపోని" మ్మటంచేను దు
ర్వామన్ వీనిషమింతునే? యడఁపనే వైరమ్ము మల్లేశ్వరా॥ 281

శా. ఏఁగోర్టెక్కుట యొక్కటే కడమకాని యెక్కుచో వెంటనే
యీ గర్వాంధుని బూడ్చివైచుఁ ద్రుటిలోనే కోర్టు దుర్వాదముల్
సాగంబోవట "వీఁడపాత్రుఁ" డని నిచ్చల్ గోర్టెఱుంగుంజుమీ?
నాగంభీరత నీవెఱుంగుమదియే నాకోర్కె మల్లేశ్వరా॥ 282

మ. అకలంకుండగు గ్రుడ్డిశిష్యునొకనిన్ వ్యాజమ్మెదోపొల్పి యీ
సకలంకుండును వీనితమ్ములును నిచ్చల్ గొట్టఁగా నేఁడు పూ
నికమైనుండిరి యిప్పుడేనియు మది న్నిపీచురాచారులన్
బెకలింతో? యికిలింతొ? వీండ్రిదొసఁగుల్ ప్రేమించి మల్లేశ్వరా॥ 283

శా. ఆవిద్యార్థికి దిక్కునేనుగద? నాకన్నన్ మఱిన్నీవు, నీ
తో విజ్ఞాపనసేయుచుంటి, నెటులో దుర్మార్గులం దోలు మ
య్యా! వేయుండును నీకుఁ గర్జములు తేపంచేననన్ గాని యో
దేవా? యందిది ముఖ్యకార్యమని నిర్దేశింతు మల్లేశ్వరా॥ 284

శా. "గోపుఱ్ఱ గర్భిణిఁ గట్టిపెట్టుటది యా గోష్ఠాల మీచేత స
ద్భావుల్ మెచ్చరటంచు ఘాతుకిఁడనుటల్ తప్పంట? నేనిందు తా

ధీవృద్ధున్ వెస మందలింపనియెడన్ దేజమ్ము చూపింతురం
టీవిద్దూర మెఱుంగుమయ్య ? పయినింతేమైన మల్లేశ్వరా 285

శా. నన్నున్ లోఁగఁగఁ జేసి సంకరపుటస్త్రంబున్ దినన్ జేయఁగా
నెన్నోపాటుల కగ్గమైతు వకు నాయిల్లంటు దొడ్డిన్ గొనన్
గ్రిన్నన్ యత్నముచేసి నేఁగొనినపైఁ గాలందులోఁ బెట్టి యీ
కన్నుల్ గానని చేష్టలన్ బలుపుటల్ గన్గొంటె మల్లేశ్వరా॥ 286

శా. నాతోడన్ గలహించుచే తమకు నానందప్రదంబంట ? నే
నీతువ్యాత్ములతోడ నేమొగముతో హ్రీ వీడివాదింతుఁ నీ
బూతుంబుంగలతోడనే మని గృహంబుం జూచి కూర్చున్న నీ
పేరితల్ కాతరుఁగాఁ దలంచి మఱియున్ వేగ్రిఁ గైరి మల్లేశ్వరా 287

మ. "వెనుకన్నాయియు ముందుగోయియుఁ,, గదా? విశ్వేశ? నీవింపులోఁ
బనిసేయన్ వలె వీంద్రదంగవలె, నాపాండిత్య మిప్పట్లనెం
దునకుం దాఁ గొఱగాదు, మందసుల దుర్ద్రోహమ్ములన్ మాన్పునే
ర్పును నీకే విపరింపఁగా వలయునే ? భూతేశ మల్లేశ్వరా॥ 288

మ. అనయమ్మున్ దనచేయు దుండగము లాద్యంతమ్ము నీతోడ నే
మనవిన్ సల్పుట కూడఁగూడ" దఁట ? నామాటీవు మన్నింపవం
టెనుఁ బోతీగతి మావరిమ్రిఁ డనెడిన్ హేలాగతిన్ గారణం
బును గూడన్ వచియించె వింటివిగదా ? మూర్ఖుండు మల్లేశ్వరా॥289

మ. "వెలిలోనుంటి" వటన్న హేతువుననిన్ విశ్వేశ ? పూజింపక
వ్వలనెందోకల నీమలింగమును సంభావించి నానంటః యీ
స్థలసవ్యాజము గారణమ్ముగ భవత్స్వాంతమ్ము నావిన్నప
మ్ములు నాలింప,,దటంచు వాకొనెడిఁజూ? మూర్ఖుండు మల్లేశ్వరా॥290

మ. ఇటులుప్పొంగునెకాని "యీయఘముతోనే" మంచు నీపూరకుం
డుట, నేనట్టులె దోషియౌతనకుఁ గోర్టున్ జూపనే మిన్నకుం
డుట, భావింపఁ, దశక్తిహేతువుగ రెండుం గూడ లోనెంచు దూ
రటనంబున్ బచరించు వీనిమదగర్వంబూడ్చు మల్లేశ్వరా॥ 291

శా. కొంపన్నిప్పిడుబొక్కఁటే కదమగాఁ గూళల్ దురంతముల్
పెంపున్ దెంపునులేక సల్పుచుఁ గడున్ బేటెత్తి యున్నారు నీ
జంపెంపున్ దెగఁదెంపులేనిగతి సాగించుచున్నావు నీ
సొంపున్ దింపుఁగ కవిత్వమిది సాంబా? దేవ? మల్లేశ్వరా। 292

శా. పాపంబేనియుఁ జేయఁజాలని మహాకంకోష్ఠపుం బీస్కుతే
యేపండాలమునేని మెక్కుదుపుగా కేనెట్లు భక్షింతు నీ
సీపుల్ దానికె నాపయిన్ దెగుటకున్నేవంచురన్గాని. నీ
చూచీచూడమికేను జింతిలెదనో శుద్ధాత్మ? మల్లేశ్వరా॥ 293

శా. మొండిన్ ఘూపునికన్న గండనిగఁ జెప్పున్ లోకముల్ వానినె
వ్వండాఁగంగల డంటివేని నిజమే ఫాలాక్ష? నీచూపురా
కుండెన్గాని తపగ్రిపందున దురుస్పృక్తిన్ బ్రిసక్తించునే
మొండుల్ నిల్తురు బండలుండెపరు? పమ్మంగాక మల్లేశ్వరా॥ 294

మ. "ఇటుపై శాస్త్రులవారి జోలికొగఁ బోనేపోము తప్పొక్కటి
ప్పటికిఁ సైపుఁ" డటంచుఁ వెంబడిగనే బండాపహారంభమే
మిటఁ డక్కంబడఁబోపురీ బడులు? సామీ? నీమహోత్కృష్ట దు
ర్ఘట నిర్ఘాపుప్రగల్భరుఘ్నటలఁ జక్కన్ దెల్పు మల్లేశ్వరా॥ 295

మ. అపవిత్రాన్నము మెక్కనేల? "యదిహేయం" బన్నమాత్రాన స
న్నపరోధింపఁగనేల? మక్కవన విద్యోపాస్తికిన్ బొక్కినేఁ
డపలాపమ్ములుగూసి దుర్గతికి దాపైమ్రిగ్గఁగానేల? య
గ్గిపయిందూఁకెడి పుష్పలట్ల యివివో? గిడన్న మల్లేశ్వరా॥ 296

మ. సుపుపున్దిట్టిన, గ్రామపాపకునిచే గుర్వగ్రి మందేహాతం
బొరిఘూషుమ్మెగయంగఁ జుట్టలనిశమ్మున్ గాల్పఁగాఁ జేసినన్
పరిహాస్టుంగొని వానిగోవులకు నిచ్చల్ కస్తి గల్పించినన్
బరమామేధ్యముదిన్న పాపము శమింపంబోదు మల్లేశ్వరా॥ 297

మ. పసఁడీయున్నము గుప్పెనో? తమకు వాఁడే చాపసి వానితోఁ
పసు తె యాతెపులూఁది బొంచఁబడు నీదదమ్మపే చావసీ

పొసఁగం బోతగు గ్రామపావకుఁడు ముమ్మందే వెసంజావనీ
యనమానాన్నముదిన్న యీపొసఁగు పోవారార ! మల్లేశ్వరా॥ 298

శా. ప్రాయశ్చిత్త మొకింతచేసుక యెటో పంక్తిన్ బడఁగారాదె? యీ
చేయన్ రాని యకార్యముల్ సలిపి ? ''సీ సీ'' యందఁగానేల? యీ
కాయన్ రాని యవాచ్యముల్ పలికి గగ్గోల్పాలుగానేల ? యి
ట్లాయాసంబడి పంక్తికర్హతను వీండ్రాః గోరుదుర్ మల్లేశ్వరా 299

మ. పరమాపాత్రులతో విరోధమది సంభావ్యంబు గాదన్నచోఁ
బరమాపాత్రులతోడి మైత్రియును సంభావ్యంబు గాకుండుఁగా?
పరిశీలింపఁగఁ బాండ్రమిత్రుఁడను సౌభాగ్యమ్ము కన్నన్ గడున్
మెఱుఁగౌ వాండ్ర కితండు శత్రువను టే మేలెంచు మల్లేశ్వరా॥ 300

శా. ఉచ్ఛిష్టులతోడనేమని జవాబీయాక నుంతెప్పుడే
నీ యుత్తున్, యచితప్పనస్సమున నాయీ వెంటనే, యేటికో
క్కో ? యీశాన? యిటౌట నీయెడఁదలో నూహింపుమేనో? యపాం
క్తేయాభాషణ దోషహేతువుగ నిర్దేశింతు మల్లేశ్వరా॥ 301

శా. లేరంచున్ బలుకన్ దుష్కృత్యములు దుర్లేపుల్ జగమ్మందు మా
కాఱుం దున్నలవంటి మూర్ఖులు ప్రాక్కాలమ్మునన్ లేరయీ
చారాచారుల నోరువిప్పుటమొదల్ సత్యోక్తి దూరమ్ముగా
జాఱున్నాలుక. వీండ్రదెట్టిదొకదా ? జన్మంబు మల్లేశ్వరా॥ 302

శా. సోదర్యుల్ పలుమందిలో నొకఁడెటో శుంఠన్న యీనేని మ మ
ర్యాదాసక్తుఁడు వేఱొకండగును సర్వత్రానుభూతమ్మగున్
మాతృభ్రాతుల పుట్టువెట్టిదియొ ? సామాన్యమ్ముగా నెల్లరున్
సోదర్యుల్ సమశీలురై రిదిగదా ? చోద్యమ్ము మల్లేశ్వరా॥ 303

శా. మూఁడేండ్ల్ చనవచ్చె నీకలహముల్ మొనెత్తినాఁడాదినన్
గాడన్ గూనెదిహాఁత రేమిచెడుగుం గర్జమ్ము రేమేను నీ
తోడం జెప్పుచునుండెదాని, ప్రీతియొంటుం జేయఁగాఁ బూన, నీ
పీడల్ నీచెవికంటవేమొ ? యని యుత్ప్రేక్షింతు మల్లేశ్వరా 304

శా. ఈపద్యాలఁట ? అచ్చువేయునెడ. నన్నీకుంక తాఁగొట్టునం
టీపాత్రమ్మది పూర్తియౌవనుకఁదా నీమన్నయున్నంగదా ?
కోపమ్మూని ననున్ మధించుటిదియున్ గొండొక్క మేరేయగున్
సాపాటాఁయలకెట్టి బుద్ధులెచుమీ ? జన్మించు మల్లేశ్వరా॥ 305

శా. ఈయూరెట్టి యనాగ్యపుం గడియలో నేర్పడ్డదోకాని యిం
దేయైశ్వర్యములేదు బ్రాహ్మణులలో నేమాత్రమున్ విద్య లే
దేయౌదార్యములేదు, నైచ్యమునహా యీయూరఁ బుట్టిల్లు సీ
సీ ? యిందుండుట మేటికింతగదుసూ ? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 306

శా. గ్రామమ్మియ్యది భాగ్యవంతమయినం గాకున్న నీయూరలో
నేమాత్రమ్మును గౌరవార్హుఁడగువాఁడే పుట్టగాలేదహో ?
ధీమాంద్యమ్మిట హెచ్చు, విద్యయెడ బాధిర్యమ్ము పైపెచ్చు సీ ?
"గ్రామేస్మి" న్ననుశ్లోక మిందలిదియేకావచ్చు మల్లేశ్వరా॥ 307

శా. ఈయూరేవిధనాడి బాగుపడి లోకేఖ్యుండనై సర్వత
స్సాయత్కీర్తి లఁ దాలవాలమగుచున్ భాసిల్లితిన్ "జన్మభూ
మియం" చున్న మహాహ నెట్లయిననేమీ యీవకేతెంచి సీ
సీ ? యన్పించి పరిత్యజింతు నిదిగో ? శ్రీకంఠ ? మల్లేశ్వరా॥ 308

మ. "విభవల్ వారలతోడనేమి" యనుచున్ బేరెత్తినాముందు మా
యభమూరాతులఁదిట్టియున్ మరల వాండ్రాయుః కలాదూరులై
పథమున్ దప్పి యొసర్చు దుష్కృతులలోఁ బాల్గొండ్రు మాయూరిన
త్ప్రభగామిత్వమిదుండె యోగ్యుఁడిచటన్ బాహ్యుండు మల్లేశ్వరా॥ 309

మ. "మడిమాన్యమ్ములు మంచియాలయ మసామాన్యాపగాతీరమం
దెడలేనట్టి నివాస" మిన్నియును నీకేకాదుసూ ? నాకునుం
వెడి, నిట్లుండియు నొక్కఁదేనియును దుర్నీతిన్ని వారించు గం
డడు లేకుండుట దీనివీడవలనె న్నాకిష్టపు మల్లేశ్వరా॥ 310

శా. "ఉండన్ గొంపము ఁ బండఁ బానుపునులే" కొండొక్క దుర్వృత్తిచేఁ
బిండంబబ్బఁగఁ బొట్టనించికొను నీపేర్తిత స్వరూపమ్మ్రలీ

బండల్ పండెడి దుర్గతింగనక దుష్ప్రాగల్భ్యముల్ సూపివా
గ్దండాఘాతమునన్ బడల్పడుటయే తథ్యమ్ము మల్లేశ్వరా॥ 311

శా. "ఊరిన్ వీడెద నన్నమాత్రమున నేయూళ్ళేడి నేటోము" సం
చారాధిన్ గనఁబోకుమయ్య? వెస నీయన్యాయపుంబీష్టు శ్రీ
కూరారంభణులింక నెందసుకలోకుల్ దిట్టఁబాలౌదురో?
యారన్ జూచుట కింపయుండుటదె కార్యంబయ్యె మల్లేశ్వరా॥ 312

శా. "తాసున్ మానిసి తోడు రొట్టె" యనుచుం దత్త్వజ్ఞులంద్రట్టివే
యీ నిర్భాగ్యుఁడు సంచరించుఁ దనకా యీలోకులందెవ్వఁడున్
గానేరాఁడు సముండటంచ చటులై యాకంఠోష్ఠ తమ్ముల్ సుటు
ర్మానుల్ పేర్లిడు రిట్టి దుష్టుల నడంపన్ జెల్లు మల్లేశ్వరా। 313

శా. గ్రామస్థుల్ పలుసార్లు మోరలపయిన్ గళ్ళాపులన్ జల్లినన్
మా మూఢాత్ములు లక్ష్యపెట్టరు త్రిపామందాత్ములై సారెకున్
సామీ? కయ్యముఁ బెంచుచుండెదరు నన్ గాటింపఁగా నెంచియే
నేమం బూనుకొలంది: వీండ్రి నెటులేనీ మాపు మల్లేశ్వరా॥ 314

మ. కవి శాపమ్ములు దేవతాగ్రహము లిక్కాలమ్మునన్ లేశమున్
దవులన్నేర" వటంచు వాగెడిని మాదద్దమ్మ యీనమ్మికన్
మివులన్ బొంగెడి బోరగిల్లఁ బడెడిన్ మిన్ మన్నుగానండు బల్
పొవరొక్కండె శరణ్యమైమెలఁగు రేపున్ మాపు మల్లేశ్వరా॥ 315

మ. పొవరుం బోతు తనమ్ము సర్వమును నాపొంతన్ వెలారించువే
తెపరేన్నైనను సాగదం చెటిఁగియే యీ మూర్ఖుడన్ లోఁగియే
శవమున్ బోలెనడంగుఁ గాంచితిని నే సాక్షాత్తుగా వీనితో
నవు గావంచెటు వాడలాడుచును నేనయ్యయ్యో! మల్లేశ్వరా॥ 316

శా. లః యూరన్ గల శాస్త్రిఁ జౌక్కరుఁడు మెన్సీ బుద్ధిహీనున్ గడున్
డాయంబోయి యవాకులన్ వదరనోటన్ మాటరాలేద య
ష్టీయల్పాత్ముని తమ్ములుంగలరు నోరెత్తన్ బ్రియత్నింపరా
యీ యాపద్విషయమ్ము సిపుకసవేడే? నాఁడు మల్లేశ్వరా॥ 317

శా. మేమే కూటిని మెక్కి యిక్కరిణి భస్మీభూతమై పంక్తికిన్
గ్రామమ్మందు బహిష్కరింపఁబడి దూరమ్మైతిమో? యీపయిన్
బో మా జోలికిఁ జేర్చికొ'' మ్మనెదరో భూతేశ? మున్ మెక్కు నా
యామాలిన్యము నూడ్ప నెయ్యదియొ ప్రాయశ్చిత్తి మల్లేశ్వరా॥ 318

శా. ఈ యుచ్ఛిష్టన కుచ్ఛనీచతలు లేనేలేమి హ్రీ వీడి గో
మాయుపజ్ఞ శరణ్యమై మెలగెడిన్ మాయావియో వీనిమా
టే యెవ్వాఁడు వినండ, యందులకు నేనే హేతువం చీ యశ
శ్ర్ఛేయం బేదియొ నాయెడన్ సలిపెడిన్ జీకాకు మల్లేశ్వరా॥ 319

శా. రః మా కుంకనకన్నసీదయినలెంకే కొంత యోగ్యుండు, వీఁ
డే మాత్రమ్ము పురోహితార్థమున ము న్నిచ్చెన్ ధరన్, దాని ని
ష్ఠీ మా తుచ్ఛుఁడు లాగికొ మ్మనిన వీఁ డీకొన్నటుల్ లే దయో
సామీ? దీనినిఁబట్టి య ట్లొరిగె నా స్వాంతమ్ము మల్లేశ్వరా॥ 320

శా. నాచే "మీ" రనిపించుకొన్నఁ దనకున్ వాటిల్లుఁ జావంచు భీ
ష్మాచర్యంబు వెలార్చి వెంబడిగ నన్ బల్ కాఱులన్ గూయు మా
నీచుం, డియ్యదిమాత్ర మాయువు గడున్ దీర్ఘమ్ముగాఁ బెంచునే?
యీ చండాలు ప్రవృత్తి కర్థ మది లేనేలేదు మల్లేశ్వరా॥ 321

శా. "ఏ పాపాత్మకు నైన మోసెదసుగానీ మోయఁగాఁజాల శు
ద్ధాపాత్రుం డగుటన్ ఋతేతరవచోవ్యాహర్తనం చాడదే ?
భూపద్మానన తొల్లి తావృకుని మా మూఢాత్మ నె ట్లిప్డు దాఁ
బాపం బాపె భరించుచున్నదొ ? మహాభారంబు మల్లేశ్వరా॥ 322

శా. శాపం బిచ్చె నిషాదివీరలకు బిచ్చం బడ్గి దండాహతిన్
గోపింపంబడి రోషనంబునఁగడున్ గూపెట్టుచున్; మాసమే
చూపెన్ బోయత తా నటన్ వ్యవధి; యిచ్చో నైన సత్యంబు సం
స్థాపింపన్ బ్రియతించి సాయుపడు మో సర్వేశ మల్లేశ్వరా॥ 323

మ. క్రిమదూరుం డయి మాదు కుంకన ననున్ గారించినన్ "వాఁడె పో
సమసెన్ దాన'' నటంచు నేను మిగులన్ శాంతుండనై యుంటి మా

సముగూడన్ జన వేద మీఁ దడఁగె దృష్టాంతమ్ము "కాఁడగ్గ రా
ర్యము గంధర్వులుతీర్చి" రంట కిదియే యౌనా క్షా? మల్లేశ్వరా॥ 324

శా. సుబ్బారాయని షష్టినాఁడు మన యీ శుఁఠన్న కెట్టెట్టులో
దెబ్బల్ తప్పెనుఁ దిట్టితోఁ డెసలె. నీ దీనుండు సోదర్యులున్
దబ్బిబ్బై యిలు సేరి రింక నయినన్ ధార్ష్ట్యమ్ములన్ మాని మే
లబ్బన్ వర్తిలున ట్లొనర్పఁ దగుఁగాదా? నీకు మల్లేశ్వరా॥ 325

శా. చావే కొండొకమంచి నాఁ డగిన నైచ్యం బట్టు నాఁ డందియున్
జీవం బుండియు లేనియట్టు లగుటన్ జీవచ్ఛవం బౌచు దు
ర్భావుల్ సోదరు లూఁతగాఁగ నిలు సేరన్ గట్టె శుంఠన్న నీ
వేపంథీతి ఘటించి తంచు మదిలో నే నెంతు మల్లేశ్వరా॥ 326

మ. పొగరుంబోతుతనానకున్ ఫలము సంపూర్ణమ్ముగాఁ గాంచియున్
బొగరున్ మానఁడ శుంఠ యెండియును దప్పందోవలే త్రొక్కుచున్
దెగసీల్గున్ గడు విఱ్ఱవీఁగుఁ దెగడున్ ధీమంతులన్ వీని కీ
తెగు లూడంగల పాచిత మ్మొకటి నిర్దేశింపు మల్లేశ్వరా॥ 327

శా. చాలున్ బాచిత మింతతో నని మదిన్ జర్చించి నాఁడంతతో
నీ యింటాకు ననుగ్రహించితివొ? నీ వెంతేని సర్వజ్ఞతం
గ్రాలన్ జాలిన వేల్పవయ్యు నిటు సజ్జత్వమ్మునం బొంగితో
ఫాలాక్షా? కను విప్పి చూడు మరలన్ బ్రిభ్రిష్టు మల్లేశ్వరా॥ 328

మ. పరమాపాత్రుఁడు గ్రామపావనుఁడు తద్వ్యక్తిత్వమ్మునందే పొరిం
బొరి నా పంచమహాఘముల్ స్థిరగృహమ్ముం గట్టి వ్రేలాడుఁ దుం
టరి నీ తెంకయు మాను కుంకయును నీ టాటోటు వాచాటు కిం
కరుడై కయ్యము రేపుచుండెడు శంకల్ దక్క మల్లేశ్వరా॥ 329

మ. అరయన్ గయ్యమె కాదు వయ్యరియు నీచాత్యంత నీచాత్మురా
దురితంపుం జెడుపాడుగట్టు లగు శత్రువాత్రవుఁబట్లు నె
వ్వారికిం గూడ దిమేధ్యవస్తువు మహాపాపాత్ము నీ పాపకున్
బరిమార్పంగదవయ్యా? గ్రామశుభమున్ వాంఛించి మల్లేశ్వరా॥ 330

శా. ఈ మధ్యాహ్నపు మాలబ్రాహ్మణశవమ్మే యొండు లేకున్నచో
నేమాత్రమ్మొ భవత్సపర్యయెడఁ దాసే లెంక వర్తించెడిన్
సామీ? వీఁ డొక సత్రికాయగఁ దనున్ జాల్మ్రందు సేవించుటన్
నీ మో మెన్నఁడొ కాని చూడఁడు సుమీ? నీ లెంక మల్లేశ్వరా॥ 331

శా. ఈ చండాలుని కారణమ్మననె యా యీ గ్రామ మిక్కట్లచేఁ
బ్రాచీనోన్నతిఁ గో :పోయి చెడియెన్ బాపస్వరూపుండు వీఁ
డో చండీశ్వర? నీకుఁదా నివెడి నయ్యో? నిత్యనైవేద్య మ
ప్పేచీకోదు భవత్పదార్చకుఁ డొగిన్ బెట్టింప మల్లేశ్వరా॥ 332

శా॥ ఆ కంకోష్ఠుఁడు కోర్టులన్ దిరుగు చీ యపాత్ర్యచే నీ కెటో
"కాక"శ్లోకపుటన్నమున్ గుడిపెడిన్ గారుణ్యమో? యేమొ? సీ
నీ కస్తూరితికూడె మెక్కెదవు నీ కాద్యంతముల్ వీని దు
ష్పాకం బే నెఱిఁగించి యేమి ఫల మో సర్వజ్ఞ మల్లేశ్వరా॥ 333

శా. స్వైరిణ్యగ్రిణి కారణమ్మ నఁగదా? చండాలమై గ్రామపున్
గారా మెల్లను బొల్లుగాఁదొడఁగె నీ కంకోష్ఠుఁడే దానికిన్
జాయం డై పెదతల్లియిల్లు చెరిచెన్ జాల్మ్రం డటం చెంచ కి
చ్చోరున్ జేర్చెను గొంప కాపెపతి చిచ్చుంబోలె మల్లేశ్వరా॥ 334

మ. ఇలు సేరెన్ మఱి యింటనే కుడిచెఁ బైనిల్లాలిఁ జేరెన్ గడున్
ఖలుఁడై యింటికి యాజమాన్యపదవిన్ గైసేసె నెన్నేడులో
మెలఁగెన్ దద్గృహమంద దుర్భగుఁడు సామీ? యామెకున్ దాసుఁడై
సలిపెన్ వంటయునీళ్ళమోఁతయు మొదల్సర్వమ్ము మల్లేశ్వరా॥ 335

మ. పయి నాస్వైరిణి వీనికన్నొఱఁగి "నాస్ బ్రాహ్మిన్సు" తోఁబొత్తాగిన్
గయికోఁ జొచ్చెను వీఁడు నక్కతన దుఃఖం బంది యెట్లేని యా
ప్రియురాలిన్ బెడఁ బాసి ద్రవ్యమిడి తాఁబెండ్లాడి గే స్తయ్యె దు
ర్నయుఁడిట్టిం డని సీ వెఱింగి గుడికిన్ రా త్తె మల్లేశ్వరా॥ 336

మ. అనయుం డెప్పుడుఁ "దొత్తు కింద పడు తొత్తై" నీదు లెంకన్ గడున్
వినయ మ్మొప్పఁగఁ గొల్చు వీని నొగి నైవేద్యానసన్ జూపి యా

జననింద్యం బనిశమ్ముఁ గోర్టుకడనే చచ్చున్ సమస్తమ్ము నీ
మనమే దీని నెఱుఁగు నీ ఖలు నెటో మాయింపు మల్లేశ్వరా॥ 337

శా. స్నానం బాడగ నేటిలో దిగియు మానఁగా, లేఁడుతాఁ జుట్టనా
ల్పీ నిర్భాగ్యుఁడు వీని నర్చనకు నీ వేలాగు హర్షించితో?
"పోనీ! లెంకయు నిట్టిఁడే యగుఁగదా? పోరాటమే" లందువా?
ఈ నీచాత్మునికన్న వాఁడెమెఱుఁగొ నెంచంగ మల్లేశ్వరా॥ 338

శా. వాఁడున్ వావియు వర్తనంబుడిగియే వర్తించు వీఁ డట్టిఁడే
వాఁడున్ జుట్టలు గుప్పతెప్పలుగఁ గాల్పన్ మిన్న వీఁ డట్టిఁడే
వ్రీడాలేశము వానికిం గలదు నిర్వ్రీడుండు వీఁ డిట్టి యీ
జాడన్ దెల్పితి వీని నింక నయినన్ జాఙాఁడు మల్లేశ్వరా॥ 339

మ. కడు దుర్మార్గులు వీం డొరినర్చుచెడుగుల్ గాంచంగలేకేను నీ
యడుగుల్ మొక్కి విధేయభావమున నభ్యర్థించుచే కాఁ నీ
యెడఁదఁగా నుంతయు నామొఱల్ నిలిపినట్లే తోఁప దయ్యయ్యో?యీ
చిడుపుల్ పోయెడిపోక లాఁగవు గదా శ్రీకంఠ మల్లేశ్వరా॥ 340

మ. నిజ మిన్నాళ్ళ కెఱుంగ నయ్యె నథవా? నీతోడ నేఁజెప్పితిఁగా
భజనాగారము మాలపల్లెగఁ గులభ్రష్టుండు మా కుంక యా
రజ మాఱంగ రచించె నంచుఁ గట? యా రాంచేయు నా దుష్టునా
కుజనున్ శిక్షితుఁ జేయువైతి విది నీకుం జెల్లె మల్లేశ్వరా॥ 341

మ. శ్వపచుల్ నైతము "దైవ"మంచు నొకచో సద్మమ్ము నేర్పర్చి యం
దపవిత్రింపుగతిన్ బ్రివర్తిలుటకై యత్యంతమున్ జంకుదుర్
గ్రుపణాగ్ర్యం డగు మాదు కుంక కెడఁదఁగా గోరంతయున్ జంకులే
దుపమాతీతుఁడు వీఁడు నాదు మొఱ నీకో? రాదు మల్లేశ్వరా॥ 342

మ. వ్యవసాయ మ్మొనరించు జీవికకునై యద్దానిచే వీధి పా
డవునే? రాముని యాలయమ్ము పఱునిత్యస్థాన మై మాలవాం
డ్రు వసింపం గల తావుగా నగునె? యీ రోతల్ మ తెందేని యౌ
న్నవియే? కన్నవియే? యిదెక్కడి దురన్యాయమ్ము మల్లేశ్వరా॥ 343

మ. సరిపో? నేర్చితి మేటిదైవమవు నీశాంతిప్రకారమ్ము ని
ర్జరులే కాదెపరేని నప్పుడురు దుశ్చారిత్రులన్ బెంపు సే
తురె? సన్మార్గుల కక్కతమ్మునఁ గడున్ ద్రోహమ్ము గావింతురే?
యెఱుఁగన్నేరనివాఁడవా? తెలుపఁగా నే నయ్య మల్లేశ్వరా॥ 344

మ. మును తాఁ గుక్కినపేనువోలె నొకటన్ బో ల్పేది బల్పేడ చ
చ్చినయట్లుండియు తెంకణంకలు గడున్ జే యూతగా నిష్టునన్
జెనకన్ డొచ్చెదిఁ బాచకాథముఁ డహో! శ్రీకంఠ? నీవి జతున్
గనలేవే? యనలాక్షి విప్పి పొగ రింకన్ గుంక మల్లేశ్వరా॥ 345

శా. పాపం బస్నము పాప మాయువు మహాపాపంబు రూపంబు దు
ర్లేపంబుం గొని పెద్దపెద్దలను గేలిం గొట్టు నిష్కారణం
బీ పీ; న్గే మని యెక్కౌ? వీనిఁ దుర్ఘటిలో నింకింపకున్నావు? దు
ర్వ్యాపారం బిది నీ మనమ్మునకు సహ్యం బౌనె? మల్లేశ్వరా॥ 346

మ. శరణమ్ముల్ మఱిఁ గొందరున్ దగవరుల్ కాపించినార్ శాస్త్రితుం
టరికిన్ బాచకసారమేయునకు గాఢమ్మైన చీవాట్లతో
"నఱపుల్ మాసుము చెప్పుదెబ్బలను నీ వాసించి సట్లున్న దం
తరముల్ గానక పొంగి కుంగఁబడుటల్ తప్పించు మల్లేశ్వరా॥347

శా. విద్యల్ నీవలనం గదా? మొదల నా విర్భూతముల్ వాసిపై
సద్యోమాత్రిక కాక యెల్లపుడు నిచ్చన్ నిల్చి వర్తించు న
య్యుద్యోగస్థులఁ గుంకతెంక లకటా? యుద్ధానకుం బిల్త్త రీ
మాద్యాస్వస్త్రిల రూపు మాపు టది ధర్మం బయ్య మల్లేశ్వరా॥ 348

మ. ఉగు పెద్దల్ పదిమందిలో మొగ మటుల్ దగ్ధమ్ము గావింప నో
రిగురన్ మోరయు వెల్లఁబాఱ శపమై యేసారి పోవుండు తా
నెనపుల్ గట్టెను గాని మా చవు లా యీ సారమేయమ్ము నో
రెగయంగా నుసికొల్పఁబూని రిది నీ వీక్షింపు మల్లేశ్వరా॥ 349

శా. రాః యుచ్ఛిష్టము వీని నీవతను దా వీక్షించుచే కాని యా
త్మీయ మ్మా నతినీచభావము లవ మ్మొనిఁ గనన్ జాల కి

ట్లాయుర్హీనతఁ దప్పుదోవలకు నత్యంతమ్ము కాల్ సాచుచున్
"సీ" యంచున్ జనులాడుటల్ గనరహో? శ్రీకంఠ మల్లేశ్వరా॥350

శా. నీ వేమో కలుగంగఁ జేసికొని యీ నీచాత్మలన్ బూర్తిగా
శాపం బూతు వంటంచు నమ్మికొని నే శాంతుండ నై యుంటి వే
దా? పిండప్రిన్ బడఁదన్నఁగాఁగలరు విద్యార్థుల్ సమర్థుల్ మదా
జ్ఞావర్తుల్ నెలవిమ్ము చూచెదవు మత్సైన్యమ్ము మల్లేశ్వరా॥ 351

శా. పం డ్లూడం బడఁదన్ను మందురొ? తలన్ వక్షమ్మున్నుం గుప్రిక్కిడన్
ముండ్లన్ బొడ్చెదికంచెలోఁ బొనిపిరామో? యేమిమీయాజ్ఞ యీ
బెండ్లంగూటిచి, యంచు శిష్యులు కడున్ వేధించుచున్నా రిఁకె
న్నేండ్లీరీతిఁ బ్రశాంతిఁ జూపు మనెదో యీశాన మల్లేశ్వరా॥ 352

మ. తమకాయుస్సులు మూడి దుర్మదపుఁ గృత్యమ్ముల్ పెంపారించుమా
త్రమ కబ్బంబిది పాపు నంచు నఁట? యీచద్దమ్మ రీసారమే
యము నాపై కసికొల్పి వెంటఁబడి తామూడించుటల్ పాప మిం
తము నొందింపకపోవ దియ్యది యథార్థం బింత మల్లేశ్వరా॥ 353

శా. పాపం బింకను బండఁగాపలసి దుష్ప్రారంభముల్ పిండప్రి కీ
వీ పాటన్ ఘటియించుచుంటి వని నే నెంతున్ బురాణమ్ములన్
రూపున్ మాసిన రండకొడ్కు లిటు లాచూధిన్ బ్రవర్తించిన
ట్లే పెద్దల్ లిఖియించి రట్టి గతి నేఁ డీక్షింతు మల్లేశ్వరా॥ 354

మ. పరమోచ్ఛిష్టులు మా యనామతరువుల్ పాపాశ్రియత్వమ్ము చే
కుతె దీనన్ దరియించవచ్చు నని ముగ్ధుల్ పొంగుచున్నారు, రూ
పఱుచే కాని తదాశ్రియమ్మున జనుల్ వర్ధిల్ల రెచ్చో చును
ద్ధరదుర్లేపు లిటే యెఱంగుదురు తత్త్వం బింత మల్లేశ్వరా॥ 355

శా. పాపాలంబన మూఁతగాఁ గొని కవిన్ బాండిత్యపాథోనిధిన్
శాపానుగ్రహదక్షు నీఁడుటకు మా చండాలశాఖాప్సుగా
టోపుల్ పూపసనుల్ పొనర్తురఁట చేటున్గాలమే కాక యీ
లోపమ్మున్ బొడసూపునే? యెఱుక నాలోచింపు మల్లేశ్వరా॥ 356

మ. సకుటుంబమ్ముగ మ్రగ్గుకోర్కి యెటులో సంభూత మౌఁగాక యీ
వికలాత్ముల్ నను హేతుభూతునిగఁ గల్పించున్ బనే మయ్యె? యీ
రిక బంధముల్ మెడఁ గట్టు కేటను దిగన్ రాదొక్కొ? రాదా? యెం
దు కటుల్ దాక యశేషగర్వ్యా మప నీ దుర్బుద్ధి మల్లేశ్వరా॥ 357

మ. తృణ మన్నట్టి యభిఖ్య గల్గు జరత్స్త్రీ యీ మహాదుర్జనా
గ్రణులన్ గాంచి "యి దేమి మీ చెడు పనుల్ గావించురే కాని బ్రా
హ్మణులే కారు తదస్యమానపుతె కా దౌ నన్నువా రుండ రం
కణఁగుం డీ" రని గడ్డి పెట్టె నఁట? నీ వాలింతె మల్లేశ్వరా॥ 358

మ. అది శూద్రాంగన బ్రహ్మచారిణి మహాచ్చాచార కొం కెందు లే
నిది త ప్పొప్పు లెఱింగినట్టిది మఱి స్త్రీ లెంక దుశ్చేష్టలన్
వదరుంబో తల పాచరాపశదు పాపంబున్ సమస్తమ్ము తా
నెవ నీకన్నను మిన్నగా నెఱుఁగుఁ జుమ్మీ? తండ్రి? మల్లేశ్వరా॥ 359

మ. ప్రతివా "రిద్ది వినాశహేతు" వనుచున్ వాక్రుచ్చులే కాని యా
రుతి యేమాత్రమొ కాక పూర్తిగ ఫలారూఢమ్ము గాలే దెటుల్
వితయౌ లోకుల వాక్కు? లట్టులయినన్ వేదమ్ములున్ శాస్త్రముల్
వితగావే? గమనింపు మీవు మదిలో విశ్వేశ మల్లేశ్వరా॥ 360

మ. జనవాక్యమ్మున దైవ ముండు నను విశ్వాసమ్ము లోకమ్మునం
దనుభూత మ్మగు నేని యీ జనులఁ బ్రత్యక్షమ్మునన్ జాటునన్
జను లెల్లన్ శపియించుచుండుట భవత్స్వాంత మ్మెఱుంగుం గదా?
కని తద్వాక్యము సార్థకం బొనరుపంగా రాదె? మల్లేశ్వరా॥ 361

మ. ఎకరమ్ముల్ పదియాఱు మున్ను సురిఁ గెన్ దృప్తుండు మాపుంకకున్
సుకరం బంటకు వీలు గాక చవుడల్ శోధింపఁగాఁ జాలు మా
రకపైరం బొకఁ డంకురించె నిది దుర్వారంబు పం డ్లెల్ల డు
ల్పక మైమై జన దింత నిక్కప మగుణా ఫాలాక్ష మల్లేశ్వరా॥ 362

శా. ఏపు ర్కుంకలు లెంక యొక్కఁడు కడున్ హీనుండు పాపాత్మకుం
డా గోలోలుఁడు పాపశాపశదుఁ డీ యల్పాయుషుల్ గ్రామమున్

బాగుం గోరిన నీకు వచ్చు లపుడే పాపంబుఁ బుణ్యంబు తా
నోగున్ బాసిను గూర్చి నంచును జగంబూహించు మల్లేశ్వరా॥363

మ. ఎవఁ డింటికా బ్రిభమమ్ము వచ్చెఁదని నీ వీక్షింతువో? దుర్జన
ప్రవరత్వమ్మున నేడ్గురుం బ్రిభములే ఫాలాక్ష! యుల్లైయిన దూ
రవునిన్ బాచకు మంగళార్థము వధ పాొరంభమం చేర్చి ప
త్ప్రవరుల్ తిట్టెడితిట్ల కర్థమును సంపాదింపు మల్లేశ్వరా॥ 364

శా. కుక్కల్నక్కలుఁ బందులున్ మఱియుఁ గాకుల్ఘోరముల్ పెద్ద
యెక్కన్ గాపుర మందు నీ యభయు లట్లే యుంట్రుగా కందువో?
నిక్కంబారయు మాట గావిది కడుస్ప్రొత్మురి తుంటపన్
కుక్కల్లోనగు వానిఁ బోలఁ గల రాకాొ? సిగ్గు మల్లేశ్వరా॥ 365

మ. శునకాదుల్ కడు నీచజీవములుగాఁ జూపట్టుఁగా నొక్కచోఁ
బనికిన్ వచ్చుట చూచుచుందు మిఁక మాబంధుత్వపర్యాప్తులో?
బనికిన్మాలినవెట్టిపీన్గులనుచున్ వాదింతు నీ మ్రోలఁ గా
దనుసామర్థ్యము నీకు నున్న యెడ నోరాడింపు మల్లేశ్వరా॥ 366

మ. తనయాయుస్సు క్షయించు నన్నయెడ శ్రద్ధన్ జూపకే యున్న నం
దనుపట్లన్ సహజన్ముపట్ల నటు శ్రద్ధన్ జూపకున్నట్టి కుం
కను మాశాఖను చక్కఁ జే తొకటఁ నేఁ గన్గోను నీ వేనియున్
గనవ ట్లొటను వెట్టిపీన్గు లని నక్కాణింతు మల్లేశ్వరా॥ 367

మ. తనకున్ శా యెడఁ గల్గు క్రోధమున మా దద్దమ్మ నస్గూర్చి తా
ఘనపాపమ్ము లొనర్పుఁగాక తనకున్ గర్గోలుగా జచ్చుఁగా
కనుజుల్ గుట్టని రేఁపి తప్పుఁబసు లయ్యల్పాత్ముచేఁ జేయఁజే
యునె తచ్ఛ్రేయము గోరువాఁ డయిన నీ వూహింపు మల్లేశ్వరా॥ 368

శా. జ్ఞాతుల్ వీనికిఁ బెక్కుమంది గల రీ చండాలు రోరోరి? దు
ర్జాతా? తప్పుడుఁ జేష్ట లొప్ప వని నిచ్చల్ మందలింపఁగఁ దా
నీతప్పుండు వినం డటం చడిగిరే నీ యుక్తమే కాని చే
యూఁతై తా నునికొల్పువాఁ డొకడుఁ డిం డున్నాఁడు మల్లేశ్వరా॥ 369

మ. తనకుం బందికిఁ బోలెఁ బోలెఁ గదా? సంతానంబు కూ దక్కఁత
మ్మనసే పూర్తిగ లేమ కష్టము సుఖమ్మున్ జిన్నినాఁ డావిగా
ననుభూతమ్ములుగాఁగ నెత్తి పలితంబై కూఁత దుర్మార్గప
ర్తన కూఁత మ్మగు నంటే? యెంతటి దురంతమ్మో? మల్లేశ్వరా॥ 370

మ. తల పూర్తి న్నరయంగ నిమ్ము తనకున్ దంతమ్ము లూడంగ ని
మ్మల మా కుంకలపాడువంశ మది తా నేనో మెటుల్ నోఁచెనో?
కలుగం డింతకు దీన నించుక వివేకంబేని యున్నట్టిఁ డీ
ఖలులన్ బెంచెద వేటికో కదా? యెటుంగన్ జెప్పు మల్లేశ్వరా॥ 371

మ. కలుషంబై రసహీనమై వికలమై సంకోష్ఠమై స్రుక్కుఁ గుం
కలలోనే నదపీస్గుమోర, మతిఁ దక్కంజాక్షి "యీ తప్పుఁ జే
ష్టలు ము" ప్పంచు వచించె నంటే? పయి నా సాధ్వీన్ మగం డత్తబా
పలు వేధించెద రంటే? సారెకును జల్పాదించి మల్లేశ్వరా॥ 372

మ. తన కౌ ముప్పు గనంగనేరఁ డఁటే? తా థా దా ధ నా గాంధ్రలో
మొసగాఁ డౌ నఁటే? మోరపై సుమిసినన్ మూర్ఖత్వమున్ వీడికో
ని నికృష్టుం డఁటే? కుంక! తమ్మ లనినన్ నీచత్వమందింతకున్
ఘను లౌ వాండ్రఁటే? గ్రామ మీ యితులచేఁ గంపించు మల్లేశ్వరా॥ 373

మ. బలసంపన్నత నాస్తి బుద్ధిబలసంపన్నత్వమూ? సున్న యీ
ఖలదుర్జాతుల కున్నదొక్కటియె పొంగల్ మిత్రముల్, వార రీ
తులుపల్ సేసెడి తప్పు కుంబసులసుం దో డౌదు రీ హేతువై
కలఁగున్ గ్రామము పింద్రధాటి కని వక్కాణింతు మల్లేశ్వరా॥ 374

శా. వ్యాధిగ్రస్తుల వెక్కిరించు చెనఁటిన్ బంగుత్వ కాణత్వ ము
ర్వాధిర్వ్యాదికదైవలోపముల నవ్వున్ బూను మూర్ఖాత్ము, స
త్సాధుద్వేషిని గాల్ప కూరక యుపేక్షన్ జేయుచో నింక నీ
క్రోధాగ్నిప్రథితి కే స్థల మ్మొచిత ముద్ఘోషింపు మల్లేశ్వరా॥ 375

మ. ఒక విద్యార్థికిఁ బుట్టువాదిగను జూ పొక్కింత తాఁ దక్కు వా
రికలాక్షున్ గని గ్రుడ్డి గ్రుడ్డి" యనుచున్ వేధించుచే దోసమున్

ప్రకటించున్ గద? లంజకొడ్కా పద మాపైఁ జేర్చి దూషించు పా
తకు నక్షల్ కడు శీఘ్రకాలమున బొత్తల్ వోపె మల్లేశ్వరా॥ 376

మ. కనులం దించుక లోప మున్న కౌముదిన్ గన్నంతనే లంజయై
జననింద్యన్ దనుజాతుఁ గన్న సపలా సాధ్వీశిరోభూషయై
చను నంచున్ మును పెన్నఁడున్ వినము మా చండాలశాఖాప్రగే
తనుజుల్ పేర్చెదిపేర్లు డీ వినికి సంధానించె మల్లేశ్వరా॥ 377

మ. నను మా బందుగు వీధి నేగుతఱి మొన్నన్ "వెఱ్ఱివెంకయ్యా" యం
చును పిల్చెన్ దొగరో? వినోదమొ? మనశ్శోకంబొ? విభ్రాంతియో?
కనుకో? మూర్ఛయొ? సన్నిపాతమొ? పరాకో? లేక షోకో? నిజం
బున కే నట్టిఁడనో? వినాశగమకంబో? తెల్పు మల్లేశ్వరా॥ 378

మ. పౌరి నూరెల్లను మోరపై నుమిసెఁ జెప్పుల్ నూపి శిక్షించె దా
మెర శ్రీ వెంకటరావు పాచకుని "మెమ్మెతెత్తె" యంచోలికో
కరసంబూనఁ జివాట్లు పెట్టె మునుపే గ్రామాధికారుల్ శిరో
ధరమున్ మాన్చిరి బుద్ధిమాత్రము జనింపన్ లేదు మల్లేశ్వరా॥ 379

మ. వరిమ మొక్కింతయుఁ దప్పకుండఁగ ననేకమ్ముల్ చికిత్సల్ మన
శ్శ్రమమున్ జూపక సల్పుచున్నను భవత్సాహాయ్యసంపత్తిలో
పముచే గ్రామ మనామయత్వమునకున్ బాత్రమ్ము గాదయ్యె. పే
గమనార్థిమష్టుల కీవు తోడ్పడిన సౌఖ్యం బబ్బు మల్లేశ్వరా॥ 380

మ. తనకుం గాలము వాపరించుటయె సత్యం బట్టులే కానిచో
జను తెల్లన్ వసు దూఱుచున్నపుడు తత్సాన్నిధ్యమం దింకఁ దా
మునువోలెన్ జరియింపమిన్ మిడికి వార్మో మౌలఁ ద్రిప్పంగ మున్
జనుస్రోవం బడి కుక్కతోఁ కగుటి దే చందంబు మల్లేశ్వరా॥ 381

శా. కాపుల్ గొట్టెడి రంపు పెల్మ లయికన్ గర్తమ్మునం బూడ్తు రం
చీ పల్కుల్ తఱచై వినంబడెడిఁ గానీ యింత దన్కన్ దవా
లాపంబుల్ ఫలియింపవయ్యె.నిటు కాలం బింక నెన్నాళ్ళు తా
రేపుల్ మాపులు గాఁగ నేగఁ గలదో శ్రీకంఠ మల్లేశ్వరా॥ 382

మ. "ముగురక్ష్ గూర్చెను ముండదేవు(" డని మామూఢుండు నీ తెంకడు
ర్భగు(డీ షాచకు( దెందు కీ చెన(టు లీగాౢమానకుణ్ణా?, లేరుగా(
కగుచో( బోయెడి దేమి? యేరికిని ద ప్పబ్బున్ వెసన్ దిద్దికో
చగు(మాంప్యమ్మపకీర్తిదాయకము తత్థ్యం బింత మల్లేశ్వరా॥ 383

మ. కరి పీఢిన్ జను పట్టుసన్ మొఱుగుకుక్కల్ వోలె మా కుంకసో
దరులున్ గుంకయు వానిజ్ఞాతులును దుర్వ్యాహారముల్ నాకు(గా
సఱవన్ జొత్తురు కంటివే కద? మదాంధ్యం బింతలో నైన ని
ష్పగమాపాత్రుల దూపు మాప( దగదే? భావింపు మల్లేశ్వరా॥ 384

శా. నీ వున్నట్టి నదీతటమ్మననె సూ?నీ తెంక మా కుంకయున్
జావం గాలము చేరువైన గుఱుతుల్ సంధిల్ల జల్ త్రుళ్ళుచున్
దేవానాంప్రియతాప్రియుక్తముగ నా తీరెల్ల( బై కెక్క దూ
రావమ్ముల్ తఱ చాచరించుట విచారం బేది మల్లేశ్వరా॥ 385

మ. "పుడకల్ దాపిన( గాని పుత్తెగుణముల్ వో"పంట?మా కుంక కీ
చెడుబుద్ధుల్ తమపాయమూలమున నిశ్శేషమ్ము గావింప(గా(
బడు(గా" కంచు మదిన్ దలంచితివొ? తత్ప్రారబ్ధ మాలాటి ద
య్యేడు న ప్తేసు మరల్ప(గా వల(తు లో యీశాన? మల్లేశ్వరా॥ 386

మ. పగనంగా( బని లే దొకం డధము( డై వంశంబు గారించుచో
భగవచ్ఛాసన మెట్టిదో కులము సర్వ మ్మట్టిదే యయ్యె( గో
ర్కి గనింటం బని యింటి వాసములు తెక్కింపం బ్రయత్నించు నీ
తెగ దీనిన్ హరియింపు మయ్య త్వరలో దేవేశ? మల్లేశ్వరా॥ 387

మ. పదిరింపంగల దోషి కేని యును మా యీ కుంకమల్ దాను "లీ
పదరుంబోతులతో(బ నేమి"యనుచో( బంచాస్యముల్ గా(గ మా
తెలి రప్పట్టున: పీం(డు గ్రామమును గాటింపంగ మీబోట్లు చూ
చెదరే? మిన్నక: పాలకత్వ మిది వో? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 388

మ. జనకున్ గూడిన నాతి తల్లిగద? యే చండాలు( డే నెట్టి దు
ర్జను( డే నాపె రమింప( దట్టి కృతి మా శాఖామృగపుత్రికల్

పనిగాఁ జేసి కృతార్థులై రిది మహాపాపంబు నీ విట్టి వాం
ఛని సుపేక్షింపట యీ యుగానుగుణధర్మంబౌనొక్కొ? మల్లేశ్వరా॥ 389

మ. కులమం దొక్కఁడు దుర్జనుం డయి కులాంకారమ్ముతో సర్వమున్
గులమున్ మాపు"నటంచుఁ బల్కుదురు ప్రాకూర్వ్యగ్రణుల్; మాదుకుం
టలవంశమ్ము సమస్త మొక్కవిధ మై కంకోష్ఠమై గ్రాలు, దు
ష్కలుషం బెందుకు? బ్రహ్మజాతికిఁ గళంకం బిద్ది మల్లేశ్వరా॥ 390

శా. ఏగుర్ సోదరు లిం దొకం డొక మహాహీనాఘమే, యీ జడుల్
మా గ్రామానకు దాపరించిరి, ధనస్వాంద్యంబునం జేసి యీ
రోగ మ్మారక యాప్య మై నెగడెడిన్ రూక్షానలాక్షిమ్యతి
ప్రాగల్భ్యమ్మునఁ గాని రూపు చెడ దీ పాపమ్ము మల్లేశ్వరా॥ 391

శా. పాపాత్ముల్ ప్రతియూర నుండు టది సంభావ్యంబ వారిట్లుగా
నే పాపంబొ పొనర్చ యందులకుఁ జో టీలేని సన్మార్గులన్
గాపట్యమ్మున నొంపఁ జూడను. వృథా కాఱుల్ ప్రసంగింపరీ
"ద్రాపుల్" నీచులు వీండ్రు సేయని యకృత్యంబేది? మల్లేశ్వరా॥ 392

(ద్రాపుల్-దరిద్రులు) ద్రాపే అంధసస్పతే ఉరిదగ్రిం నీలలోహిత"
అని వేదపరిభాష—

మ. పరమాపాత్రుఁడు గ్రామపాచకుని గర్వగ్రంథి "ఈ గ్రామంప నీ
శ్వరుఁడే రావలె" నంటకున్ మొదిరె నేఁ బ్రత్యక్షమున్ వింటి నీ
పటుఁ స్త్రేలఁగ నేఁడు నీ యళికదృగ్జ్వాలావళీలక్ష్య మై
యుఱు గ్రాఁగన్ దఱి యయ్యె నొక్కొ" యని నే హర్షింతు మల్లేశ్వరా॥

శా. గ్రామ్ము మ్మారయఁ జాల నీరసము విప్రప్రాభవం బెన్నఁడో
నేమిన్ లే; దధమాధముల్ కల ద్విజుల్ హేయ మ్ముపాదేయమున్
ధీమంతుల్ గనఁ జాల, రట్టులగుటన్ నీ తెంక మా కుంకలున్
స్వాముల్గాఁ బిలపెట్టి దుర్నయములన్ సాగింత్రు మల్లేశ్వరా॥ 394

శా. మున్నే తెల్పితి దున్నరక్కసునకున్ ముమ్మాటికిన్ దీటుగా
నున్నాఁడంచును నీదు తెంక, మఱి యా యున్మాదికిన్ మొన్ననో

సిన్నో తన్నులు సర్వసిద్ధములుగా నీవుండు కాళ్ళన్ బడెన్
దనైన్య పుణ్యా మెఱింగియు న్విడిచె నాతం డంత మల్లేశ్వరా॥ 395

మ. పరమార్థ మ్మెఱు ఉన్న నర్చకుఁ డసన్ బల్ తేలికై లోకుల
ల్లరకున్ దోచెడిఁ బాపకాధముఁడు వాఁ డాయమ్మ నవ్వారిదే
పరగాఁ గొల్చెడి, వాని నర్చకుఁడు సేవ న్నిచ్చలున్ సల్ప నా
కరుఁగాఁ జూచెడి గ్రామపుంగరిమమున్ గన్గొమ్ము మల్లేశ్వరా॥ 396

మ. ఇఁక మా కుంకలు "మామ మామ" యనియా హీనున్ మరామాన స
ర్చకునిన్ బిల్తురు పాపకున్ బతెనె యీ జాత్యంధులన్ వాఁడు సా
రెకుఁ బిల్చున్ మఱియొండు గ్రామమున నీ రీతుల్ గనంబోల నో
పెకయుల్ మూఁగురకూటమూరికిఁ గడున్ బ్రేఁగయ్యె మల్లేశ్వరా॥ 397

మ. తల చర్లీలములన్ దొరింపొరిగ మద్వైరాసకున్ బేర్చి పూ
జరి దుస్సన్ ఖలుఁ బాపకాపశదు మచ్ఛాఖామృగీపుత్రులన్
ద్వారలో దత్పలఖాక్కలన్ సలుపుచున్ "నాశ్లీల"మన్ వేదవా
క్యరహస్య మ్మెఱిఁగించి కై కొనుము మత్కావ్యమ్ము మల్లేశ్వరా॥ 398

మ. తల చర్లీలము లైన శ్రాద్ధముఖశబ్దమ్ముల్ పరిసంగించు మా
పరఘూపాత్రులఁ బాపకార్చకులఁ దద్వాగర్థలక్ష్యమ్ముగాఁ
బరఁగన్ సల్పుట వేదచోదితమ తత్ప్రారబ్ధకర్మాన రె
వ్వరు కర్తల్! గురుధిక్కృతుల్ పృథగఁ బోపం బోవు మల్లేశ్వరా॥

శా, నాపై నెప్పుడు తప్పుకే సిడెనో మా నాగమ్మ, నాఁడే మొదల్
"సీఃపాపాత్ముఁ" డటం చెఱింగి మదిఁ దత్క్షేమంబు తోపాయినా
నీ వల్గాకి సహాసనాన్నములయం దేవంబు నే నూనఁద
త్కోపం బాత్మఁ గలంపఁ బ్రేలెడి నవాదుల్ వీఁడు మల్లేశ్వరా॥ 400

శా. "పంచత్వమ్మను పిండ్రదకి" మ్మనుచు నేఁ బ్రార్థింపఁగాఁ బోను ని
న్నంచున్ ము న్నని నేటి కెట్లు వ్యతిరేకార్థంబు యోచింతు పి
పంచున్ బల్కెదొ? సత్యమే క్రిమముగా నవ్వాంఛ్ర మర్త్యత్రికా
"పంచత్వమ్మను జాల" దంచు మది తోఁపంచేన మల్లేశ్వరా॥ 10

శా. అంతో యింతయొ నాకడన్ జనివి నా యంఘ్రిద్వయం బొత్తి పై
నంతం బందెడి బుద్ధి తారసిలి యత్యల్పాత్ములం గూడి కా
సంతేనిన్ దర్పిప లేక మా జడుడు నన్నాక్షేపణల్ సేయు న
వ్వాంతుల్ సైఁచెడినీదుశాంతి మిగులన్ వర్ణ్యంబు మల్లేశ్వరా॥ 402

మ. గురుఁడ న్నేను మదీయకోప మది నీకున్ రాదు వారింప, మ
త్కరుణాపాత్రుఁడ యేని నీ కొకటఁ గోపం బబ్బుఁగా కెట్టులో
మరణాపాయము తప్పఁ జేయ నగు నిమ్మర్యాద శాస్త్రమ్ములే
ద్తెలు సిద్ధాంత మొనర్చు నీ వెఱుఁగవే దేవేశ మల్లేశ్వరా॥ 403

(శ్లో॥ శివక్రోధాద్గురుస్త్రాతా గురు క్రోధాచ్ఛివోనహ")

శా. "నీచుల్ వీం"డ్రని మిన్నకున్నకొలఁదిన్ నిర్హేతువైరమ్ము లీ
పేచీకోరులు పెంచ నెంచెద రిసీ? పింజారిబల్ మూఁకతో
కాచపాత్రియులతో ననామకులతోఁ "గా"దంచు, "నౌ" నంచు నే
వాచారంభణముం బొనర్చుట మహాపఖ్యాతి మల్లేశ్వరా॥ 404

మ. దురితాత్ముల్ ఋషులన్ వృథా చెనకి తద్దుర్వారకోపానల
స్ఫురణన్ మ్రగ్గి"రటంచు గ్రంధములఁ బ్రాగ్పూర్వ్యగ్రణుల్ వ్రాసి యుం
చిరి వీండ్రిట్లనె నాకతానఁ జెడుటల్ సిద్ధాంతమే "నానృషిః
కురుతే కావ్య" మటన్న మా టెఱుఁగవొకో? నీవు మల్లేశ్వరా॥

శా ఛందోబద్ధముగా మదీయ మగు నాస్యంబందు వెల్వడ్డ యే
సందర్భమ్మను లేశ మేనియును, తూ, చా, తప్పకుండన్ ఫలం
బందన్ గల్గుట నీ వెఱింగినదె యీ యల్పాత్ము లిద్దానిచేఁ
గుందున్ గుడ్డురొ? విందె గుడ్డెదరొ? కన్గోవయ్య? మల్లేశ్వరా॥ 406

మ. ఒక వడ్రింగికి వాని సోదరున కన్యోన్యాను పీడాకరం
బకుతోహేతుక మైన పోరొకటి యీ యల్పాత్ము లెట్టెట్టులో
ప్రకృతం బేర్పడఁ జేసి రిట్టి చెడుగుల్ పల్మాఱు గావించు పా
తకులన్ ఘాతుకులన్ బకప్రకృతులన్ దండింపు మల్లేశ్వరా॥ 407

శా. "దారిద్ర్యమ్ము ఘటింపు మంటి" వటు సంధానింప నిష్టిప్పదే
ప్రారంభించితి సందువో? నిజమె తాపన్మాత్రమే య్యెన నీ
కూర్పిరులొ దారికి పెత్తు రంచు మది నాకుం దోఁపదట్లొట నీ
కొఱుంచున్నల రూపుమాపుటకు సంకల్పించు మల్లేశ్వరా॥ 108

మ. సుజనుల్గా రిక్తత చేరి జ్ఞానగరిమన్ శోధించు, దుర్మార్గపుం
బ్రజలట్లా రిక్తత చేరె నేని యది చౌర్యపాపపరంబై కడుల్గా
వృజినంబున్ నెగడించు పండద్రికుల మా యీ ప్రవృత్తిఁ జేరంచుటల్
రజనీదేవత చెప్ప నాపె గద చౌర్యజ్ఞాత్రి మల్లేశ్వరా॥ 109

మ. లప మేనిం దిప్ప యున్నచో నయుఁడు శీలమ్మంచు వర్తించు మా
పొవరుంబోతుకుఁ గుంక కద్ది సుతరామున్ లేమి స్పష్టంబు యీ
యవివేకుం డపు డప్పు రాగమని తా నాలాపనల్ నేయు దూ
రప మాలించిన సర్వముల్గా దెలియు నైర్లజ్జ్యంబు మల్లేశ్వరా॥ 110

శా. హ్రీ సామాన్యము గాదు పెద్ద గుణమా హ్రీలోపముంజేసియే
స్త్రీసౌశీల్యముఁ బూరుషోన్నతియు భస్మీభూత మైపోవు స
ర్వాసహ్యమ్ము లగున్ మహోన్నతము లౌ నయ్యెం యుపీకారముల్
హ్రీసంపన్నముగాని పాణి మిగులన్ హేయంబు మల్లేశ్వరా॥ 111

శా. స్త్రీకుండన్ వలెఁగాని పూరుషునకున్ హ్రీయుండ రాదంచు సు
శ్లోకుల్ వ్రాసిన వ్రాఁత కాదన నెవన్ శోధించి తత్తత్కృతుల్
ప్రాకట్యమ్ముగ నిర్ణయించునెడ హ్రీ భామార్థమే కాక స
ద్ధీకల్పుద్రిపుమర్థ మంచుఁ దెలియుల్గా దేవేశ? మల్లేశ్వరా॥ 112

శా. హ్రీమత్వ మ్మెట నుండు నయ్యెడలనే శ్రీమత్త తా నుండు సు
శ్రీమత్త్వ మ్మెట నుండు నయ్యెడలనే హ్రీమత్త తా నుండు నీ
శ్రీమద్ధ్రీమదభేదముంగుఱిచి నేఁ జెప్పం బనే మయ్యొ? త్వ
ద్భామారూపము లీ ద్వయం బనుచు సిద్ధాంతమ్ము మల్లేశ్వరా॥ 113

మ. "నగుచున్ జేయును రేడ్చుచుంగుడుతు" ర న్మాటించుచుంతేని యీ
పొగరుంబోతు లెఱుంగ రెల్లపుడు తప్పుల్ నేతురే? యట్టిరే

యగుచో తెంకకు నెన్ని యెన్ని ఘగవాట్లమ్యెన్ గతానేహమం
బొగినేఁడేనియు బుద్ధి వచ్చినదె? నీవూహింపు మల్లేశ్వరా। 414

శా. స్నానార్థమ్ముగఁ గంఠదఘ్నజలవాసం బందియున్ జుట్టకా
ల్చే నిర్భాగ్యుఁడు మానఁజాలఁడొ తత్రిపాహీనున్ జడున్ వాని న
జ్ఞానిన్ బావకు మూఁతగాఁగొని ననున్ సాధించు మా కుంకమున్
కానున్నట్టి యనర్థ మించుక యెఱుంగన్ రేమ మల్లేశ్వరా॥ 415

శా. "కానుండెన్ క్షురకర్మ" మంచుఁ దెలుపంగా నొక్కొ? యీమధ్య నా
నీ నీవాత్మకుటుంబినీ సహితుఁడై చెన్నాను నీ తెంకతో
మా నాగమ్మకు వేంకటేశ్వరుని సమ్మానమ్ము యావచ్చెనో
జానీరాపహరమ్ము కన్పడెడి దేవా? చూడు మల్లేశ్వరా॥ 416

మ. తిరుపత్యద్రికి నేగి యయ్యెడల నీ దృష్టాత్మకుల్ పూర్తిగా
క్షురకర్మమ్మున కగ్గమైన కతమున్ శోధింపఁ పన్నాము భా
స్వరు నేతత్కవి దూఱులాడు నఘమున్ బాయఁగా బ్రియత్నించుటో?
మఱి యేమో వివరింపుమయ్యా? మది సంభావించి మల్లేశ్వరా॥ 417

మ. పరమాపాత్రుఁడు దాసియున్ జడుఁడు తత్పంఘుప్రజంబున్ దనున్
బరివేష్టింపఁగ నేగఁ గా కథ ముగిన్ బాయుంగ నీ తెంక తా
నరరే? తిర్పతి.కీ ఖ యం దకట?యే మం చేగెఁ? తద్దాసికా
చరణారాధన కొక్కొ?సి గ్గుడిగి మా జాల్మంపు మల్లేశ్వరా॥ 418

మ. ఇల దుత్తూరము భంగసనున్ గలియునప్లే దుష్టుఁడున్ దుష్టుఁడున్
గలియున్, బ్రిస్తుతమైత్రి యట్టిద యగుం గాదేమి. యీ మర్త్యుల్
వెలియై యెక్కడొ మర్గ్గి కర్కటుచటా? విశ్వేశ? క్షేత్రమ్ములన్
గలుషమ్ముల్ పొసరింప నేగుట కడు న్గర్హ్యంబు మల్లేశ్వరా॥ 419

మ. తురకల్ ముష్కరులై దురంతముల బద్యోగింప సింహాద్రి శ్రీ
నరసింహుండు హరించెఁ గూర్మికవివిజ్ఞప్తిన్ మదిం బెట్టి యీ
పరమాపాత్రు లొనర్చు దుండగములన్ వారింపు వాక్రుచ్చి నో
రఱుగన్ జొచ్చె నుపేక్ష సల్పె దిది యే మర్యాదయ్యో? మల్లేశ్వరా॥ 420

మ. శిశుపత్యాదిర్కి దాసితోడఁ జనియెఁ దృప్తుండు నీ లెంకనే
హరియింపందగుఁగాకదాసి ననదన్ హంతవ్యగా నెంచి యే
డ్తెఱ వెన్వెంట హరించు టన్నది భవత్త్రీవ్రాక్షికిన్ దుర్యశ
స్కారమే త ప్పెటు తప్పికోఁ దలఁచితో సర్వజ్ఞ? మల్లేశ్వరా॥ 421

శా. దాసీరండను జంపుపోవ మది నావా? నీదు పే ర్వానిదా?
యీసున్ జెంది వృథాగ న న్ననెదవే? యీవందు వే నొప్పితిన్
వాసిన్ జూడఁ బతండు స్త్రీవధయుఁ దా వర్జింపఁ డౌఁగాక యీ
కాసున్ జేయని దానిఁ జంపుట వృథా కర్జంబు మల్లేశ్వరా॥ 422

మ. కుసుమన్ బెట్టదు నీదు భూములను నీకున్ జీఁకటిల్ సూప,దే
వవరుల్ పేర్మిలదుపూజనీయుల, మృషావ్యాజ్యమ్ములం దెచ్చి పో
రదు విప్రస్వము లైన వృత్తులకు నేరం బేమియున్ లేప. యే
మిది వానిన్ విడి దానిఁ జంపె నలమేలీశుండు మల్లేశ్వరా॥ 423

శా. దేవాదాయపుఁబల్లు బిఱ్ఱబిగిసెన్ దీనుండు నీ లెంక నిం
కేవారున్ జెడఁదీయనక్కఱది తేనేలేమ మా కుంకలో
యేవం బెల్లయు నెట్లు గాంచెఎరొ యల్లే వోదు రెప్పట్ల నీ
దేవానాంప్రియు లార్తి గాంచెద రఘాబ్ధిన్ గ్రుంగి మల్లేశ్వరా॥ 424

శా. కుంకల్పంచక మందులో నలువురన్ గొంపొక్కవా క్రుచ్చితిన్
బంకాత్మత్వమునందుఁ బంపముఁడు తా బాలుండె యయ్యో న్నిరా
తంకుం డన్నల కన్న వానిని భవత్స్వాంతం బెఱుంగన్, గడున్
అంకుంగాడిదకొమ్ము వాని చెడు చర్యల్ విన్మ మల్లేశ్వరా॥ 425

మ. బడికిన్ మా చినకుఱ్ఱఁ దేఁపఁటితి నీ భ్రష్టుండు నిష్కారణం
బొడికెన్ బాపము గట్టికోఁ దలఁచియొక్కో?యేమొ దుర్భాషలన్
జెడఁ బ్రేలున్,వినిపించుకో వరుగ "నిన్నె నిన్నె" యం చార్చు నీ
దుడుకున్గాడిదకొమ్ము కేటికొకొ? యీ దుర్బుద్ధి మల్లేశ్వరా॥ 426

మ. "కఱపెంబో?శునకంబు దానిఁ గఱవంగాఁ బోపు నెవ్వాఁ డ" టం
చుర కివ్వాంఁడ్ర నుపేక్షసేయ మిగిలెన్ యుద్ధావరం బీచెఱుం

ఖరియాకుక్కల, కిప్పుడే చెడి స్వతఃపాపమ్ముచే [redacted]
గతి,రట్లయ్యును దుర్నయంబు విడుపంగాఁ బోదు. మల్లేశ్వరా॥ 427

మ. గతమందే చెడె నీదు వెంక,త్వరలోఁ గానుండె ఘోరంబు దు
ర్గతికిం బెత్తెఁడుకన్న దగ్గఱగఁ గుంకల్ దేఁకుమన్నారు, దు
స్థితి నిట్టుల్ కడు బ్రుంగియున్ విడదు దుశ్చేష్టల్; భవిష్యద్దురా
గతివిన్నన్ మఱి యొండు హేతు వరయంగారాదు మల్లేశ్వరా॥ 428

మ. బడి సోదర్యుని మానిపించికొని రీ భగ్నాయకుల్ వీంద్రతోఁ
జెడుకూడేఁ గుడువంగ లే'' దనుచు, దుశ్శీలుండు కుశ్లుండు తాఁ
జెడిబాలేయముకన్న మిన్న యగుచున్ "సీసీ" లకున్ భోక్తయై
కడకున్ దన్ను లోకంట మొన్న దినె సత్కారమ్ము మల్లేశ్వరా॥ 429

శా. ఛాత్రుం డై యొకకొన్నినా శ్రితరశిష్యవ్రాతముం గూడి యే
మాత్రింబో పఠియించె నీ చెనఁటి యస్మత్సన్నిధిన్, బిమ్మటన్
శత్రుత్వంబు పురస్కరించికొని నీచైర్ధ్యానముల్ గూసి స్వ
భ్రాతృప్రీతి గడించెఁ గర్ణానుము సౌభ్రాత్రంబు మల్లేశ్వరా॥ 430

మ. ఇలు దీర్పంగలవాఁ డవాత్రుఁ డగుచో నిల్లెల్లఁ దా నట్టిదై
పొలుపుం దక్కి నశించు,జ్యేష్ఠుఁ డటు దుర్బుద్ధిన్ బ్రవర్తించుటన్
గల సోదర్యులుగూడ నట్టులయినన్ గాఱింప నుంకింతు రి
ప్పలుగాకుల్ చెడి నేఁడు నారక మటన్ బ్రాపింత్రు మల్లేశ్వరా॥ 431

మ. తమ వంశమ్మున కెల్ల దేశికము మద్వంశమ్ము తావృగ్గురూ
త్తము న స్నారక నేలి నేసి జయ మొందన్ బూజరిన్ బాచకున్
గ్రిము లం చెంచక తోడు చేసికొను నీ క్లిష్టాత్ములన్ నే నెటో
క్షమియింపన్ ఆనుఁగాక నీకుఁదగునే సైరింప మల్లేశ్వరా॥ 432

మ. తను వస్వస్థము గాఁగఁ బన్యుషితమంథం బేను దర్వాణితోఁ
దిను టీ వెల్ల నెఱుంగు దీ చెనఁటు లేదిన్ గానరాకేమొఃయ
ప్పని నుద్ఘాటన చేసి నన్ను నుడికింపన్ జూతు రష్టప్పు డీ
ఘనపాపాపుల బుద్ధు లెంతటివొ సంశోధింపు మల్లేశ్వరా॥ 433

మ. తన మేనల్లుని "బిన్నతమ్మునకు నేతత్పుణ్యకార్యమ్మిటుల్
కొనసాఁగింపు"మటంచుఁ దోడొసఁగె నీ కుంకన్న; పప్పా ప్పెఱుం
గని యా కుట్లుఱు కాకు లట్టు లఱపంగా నీవునున్ వింటి వీ
పనిక్లిన్ నీ హృదయంబు నొవ్వమియు నేవం బయ్యె మల్లేశ్వరా॥ 434

మ. "తన కుట్లుం డిట్టున్నబాపపడు విద్వద్గ్రామ"మం చెంచి సం
దను డించెన్ జనకుండు మాతులగృహస్థానమ్మునన్ వీండ్ర దు
ర్జనతఙ్గ సర్వము రా నెఱింగియుసు; గుట్లుం డీ గతిన్ మాతె, నొ
జ్జను చేయుం దలపెట్టఁ గోఁతి యనదే సత్యంబు మల్లేశ్వరా॥ 435

శా. పాపం బీతఁడు మందలింపఁ బ్రికృతపాప్రిరబ్ధదుష్కర్మలన్
గోపాటోపము సూపి స్వాలపలఁ: నీ కుంకన్న లా బుద్ధి తా
మేపాటిన్ జెవిఁ బెట్ట కాతనికిఁ దామే పాఠమున్ జెప్పఁగా
నాపద్ధాము లటంచుఁ దా మడిగె నయ్యార్యుండు మల్లేశ్వరా॥ 436

మ. అతఁ డిప్పాంధ్ర యపాత్రప్రవర్తనకు నత్యంత మ్మెదన్ రోసియున్
సుతు నిప్పాపులయెద్ద వీడుట కడున్ శోచ్యంబు, సద్వర్తనుల్
పతితాళాపముగూడ వీడి రపటన్ బంధుత్వ మేమయ్యె దీ
క్షితచారిత్రము నీ వెఱుంగనిదియే శ్రీకంఠ మల్లేశ్వరా॥ 437

మ. కుమతుల్ చే రని కాదు గాని ఘువి మా కుంకన్నకున్ దీటు గా
నము,వదర్రింపుల పోఁడు నీ వెఱుఁగు దీ నాగమ్మయే పెట్టె లా
భ మపేషించి;య చెట్టి చన్న?విను తద్భ్రాతృద్వయమ్మందు ని
క్కముగా నొక్కని కొంప దీయుటకె సంకల్పంబు మల్లేశ్వరా॥ 438

మ. అల వదర్రింపులయం దొకానొకని భార్యన్ వీఁడు కామించి వా
రలఁ గోర్టెక్కఁగఁ జేసె,భర్త కనులారన్ గాంచి సీ? యంచు న
య్యేలనాగన్ విడి పీని జీవమున కెంతే నెయ్యపుం బోదె నే
యిలకో,జాడయుఁ గానరాదు కనుఁగొంతే?తండ్రి? మల్లేశ్వరా॥ 439

మ. పను పేలాటివి వీం బ్రానయ్యనవియప్పావాత్రకుల్ స్వేయదు
ర్జనతామూలము లౌ నమందశము లాస్వాదించుచుం గూడ ము

ర్జనతన్ వీడమి నీ వెఱుంగుమవు సాక్షిద్రష్టవే కాక స
ర్వనియంతృత్వము గల్గు నీ కౌకఁ డవార్యం బౌనె? మల్లేశ్వరా॥ 440

మ. అపవిత్రం బగు మోరతోడ నపవిత్రాలాపియై చుట్టకా
లుపుదుర్వాసనతోడఁ బాచకుఁడు నీ లోగింటికి న్వచ్చి య
ష్టపు దయ్యార్చకకృత్యముల్ సలుపు,నీ న్నవ్వాని దౌరాత్మ్య మే
వపకన్ జేయుమి కక్కసంపడి సుమీ?ప్రశ్నింతు మల్లేశ్వరా॥ 441

శా. వీనిన్ జూచిన వీని గాథ వినినన్ వీనిన్ సమీపించినన్
"నీఃనింద్యం"డను బుద్ధిపుట్టు నీవ్రత స్నిద్ధుంబ య ట్లౌటనే
వీనిన్ భావజ్ఞులుల్ త్యజించిరి శుభావిర్భూతులన్ బూర్తిగా
నీ నీచుం డిటు కూడు నీవు తినుటల్ హేయంబు మల్లేశ్వరా॥ 442

మ. ఎపుడున్ బోలకళాభిఘాతుఁ డగు నాయీ పాచకుం డేడ?ని
త్యపవిత్రుల్ పొనరింపఁగాఁ దగిన నీ యర్చాదికం బేడ?యీ
శ్వపచున్ జంపియొ లేక కా ల్విఱిచియో,సాక్షిద్విపద్గేహముం
దపమున్ మాత్రము ద్రొక్కనీకు మిదియే నా కోర్కి మల్లేశ్వరా॥

మ. మొన మా కుంకలలోనఁ బంచముఁడు బల్ ముగ్ధుండు మేసల్లుడున్
దిని మాఱ్పండి పృథాగ మామకకవార్థిన్ "లంజకొడ్కా?"యటం
చని మిత్తిమ్ముగఁ దిట్టు టీ వెఱుఁగు దీ యన్యాయ మేలాటిదో?
మన పేర్కొన్నడిఁ దెల్పఁ జాలుమవె?యో విశ్వేశ మల్లేశ్వరా॥ 444

శా. నీ పూరేగెడిపేళ్కఁ గుంకమొదలా నీచాత్మకుల్ స్వీయదు
ర్భావముల్ వికసిల్ల మామకగృహద్వారస్థు నన్ జూచి యో
దేవా?పేర్లెడిపేర్లుడున్ వినియు నీదృష్టాత్ములన్ వేర్మిడిన్
జాపన్ జూడని నీదు శాంతికి నమస్కారమ్ము మల్లేశ్వరా॥ 445

మ. ఎదుటన్ బల్లకె నున్న నీ యునికి పీం దేత్రమాత్రి మూహింపకే
వదరుల్ పేర్లెద, రిట్టి మర్బగుల నీఘాలనజ్వాల దు
ర్మద మాఱింపమి యక్కసంబు. మఱియుం బాపంబు పర్ధిల్లి య
య్యదియే తత్కృతికర్త యౌ ననెదె? యట్లౌఁగాక మల్లేశ్వరా॥ 446

మ. దురహంకారులు పెంపుఱి నన్నుఁ గని శత్రుత్వమ్మునంజేసి తుం
టరికృత్యమ్ము లొనర్చి వెల్లమొగముల్ నానాఁట దారిద్ర్యదు
ర్భరముల్ గ్రుక్కి సహించుచుండి రనుటల్ ప్రత్యక్షమే కాని స
త్వర మీ దుష్టుల దూపుమాపుటకునై ప్రార్థింతు మల్లేశ్వరా॥ 447

శా. కూడుంగుడ్డలు లేక మాడుచు కసేకుల్ గోరుచున్నార లీ
పాడుంబీస్తులఁగూర్చి. యట్టికళయున్ బ్రత్యక్షమై పూర్తిగా
వాడున్ మోరల వ్రేలుచుండినను నీ వాజమ్ము లేమాత్రమున్
గూడన్ దుండరిపోకలన్ విడిచి యోగ్యుల్ గాయ మల్లేశ్వరా॥ 418

మ. హితులై కొల్చుటకన్న శత్రు లయి నన్నే హాఁతలో కూసి యు
ద్ధతులై మత్కపితాస్త్రపాతహతులై యాయుఃకలన్ రోసి దు
ర్మృతికిం దాల్పడుటే సుఖం బనుచు నీ మేధ్వోతరుల్ చాల దు
ర్మతులై రంచుఁ దలంతు నింతయు యథార్థం బయ్యె మల్లేశ్వరా॥ 449

మ. ఇది మా కుంక నెఱుంగ నెల్లమను "వీఁడే చావు తాఁజచ్చునో
యెటకుం బోవునో చచ్చియుంతటి. జడున్ హీనున్ గృతఘ్నున్ మదా
క్రాంతుఁ జూడన్ ఘటియింప దీ తులువకున్ గాలమ్ము దాపై వృథా
రటనం బేర్చెడె నంచు రయ్యెది యపార్థం బౌనె? మల్లేశ్వరా॥ 450

మ. ఋణ మేర్పడ్డది, భూమి పోయినది మున్నే కొంత. నేఁ డున్న యా
యణుమాత్రమ్మునఁ గొంత యమ్మఁబడె నేద్యం బన్నచో లబ్ధిబ్రా
హ్మణులం దుండము వేత చెప్పవలెనే? మా కుంక కిట్లయ్యె దు
ర్గుణముల్ మాత్రము తగ్గకున్నయవి కష్టోపయ్యె? మల్లేశ్వరా॥ 451

మ. విధవన్ మొక్కినఁ "బుత్త్రుఁబోదు" మని దీవించుంగదా? నేఁడుమా
యధముం డట్టిదె యర్భకున్ విధవ సత్యంతమ్ము సేవించి దు
ష్పథసంచారమునన్ దరిమ్రిఁ దను తత్సామ్యమ్మునం బూర్తిగాఁ
బ్రిథమోదాహృతి యయ్యె సర్వము సుసంపన్నంబు మల్లేశ్వరా॥ 452

శా. ఎద్దుల్ బండియు జీవనార్థ మగుటే హేయమ్ము తన్మాత్రిఁగా
కిద్దుఃఖమ్మున తాళ్ళ దోలుటకునై యేర్పాటు గావించుటో

తద్దన్ దుర్గతి, యటి దుఃఖమ్మున మా వద్దమ్మ నేఁ డుండె నిం
కిద్దారిద్ర్యమువల్ల సిగ్గువడఁ డీ హీనుండు మల్లేశ్వరా॥ 453

శా. ప్రాయశ్చిత్తము కొంత చేసితివి తత్ప్రారబ్ధమున్ ద్రిప్పఁగా
నీ యుద్యోగము చాలదయ్యె, నటుపై నే నన్ను నిన్నీచుడన్
డాయన్ రోయను గూడ నేవపడుచున్ నామాట లాలించి యీ
శ్రేయోమార్గుల రూపుమాపుటయె సంక్షేపంబు మల్లేశ్వరా॥ 454

మ. ప్రకటం బయ్యె భవత్కృపారసము నాపై నీచకున్ గ్రామపా
లకు నేఁడే చెడఁ దిట్టి వాని యనుఁగుల్ చావేక జీవింపఁగా
నక "మొట్టో" యని యేడ్వ వాద్యములతో నన్ బల్లకీ నుంచి త
క్కక యూరేగఁగఁ జేసి తేవియె ముదన్ గల్పించి మల్లేశ్వరా॥ 455

మ. తెలిసెన్ నీదు కుయుక్తి వెల్మ్రబౌరసేఁ బెట్టిచి తప్పాపకున్
పలుఁగాకిన్ శునకప్రలాపుని సభావ్యాజమ్మునన్ నాకుఁగా
పులచే నుత్సవమున్ ఘటించితివి నీ పోకల్ సమస్తమ్ము ప్రా
జ్ఞులిటే కైకొనుటల్, భవద్రచన బల్ గూఢమ్ము మల్లేశ్వరా॥ 456

శా. ఎన్నోసార్లిటు లే యమేధ్యులను నయ్యేన్ శాస్త్రి: యట్లయ్యు నీ
మన్నల్ నైజగుణంబు వీడరు సుమీ? దుర్వృత్తు లిం కీ పయిన్
ఎన్నల్ గూడ ఘటించి చూడు మొకచోఁ; దచ్ఛాస్త్రిచే నీ జడుల్
కన్నుల్ విప్పుదు రేమొ చూత మదియుం గానిమ్ము మల్లేశ్వరా॥ 457

శా. తన్నున్ జ్ఞానమునన్న నీచముగ నేతద్గ్రామవాస్తవ్యులా
చిన్నల్ పెద్దలు గూడఁ జూచెదరు మా పెండ్యాల దేవయ్య యీ
యన్నన్ బూర్తిగఁ దా నెఱింగియును దుశ్చర్యల్ విడంబోవఁ డా
సన్నాహాయుల లక్షణమ్ము లివి వో? చర్చింప మల్లేశ్వరా॥ 458

శా. నానాదేశములన్ జరించితిని నానారాట్సభల్ చూచితిన్
నానామానవజాతిపద్ధతులన్ నానాఁటి శోధించితిన్
నానామూఢులఁ గాంచితిన్ మఱియు నానానీచులన్ నెట్టితిన్
గానీ మాజననింద్యుఁ బోలు ఖలునిం గన్గోను మల్లేశ్వరా॥ 459

శా. ఊరన్ వర్తిలు భూవరికోటి నను( దా నూరేఁగఁగాఁ జేసెఁ జో?
పేరుం బెంపును గల్గు పొందెఁ దనకున్ బెండ్యాలదేవయ్య క
య్యారే? వల్వని వంత యేమిటికొరో? యల్పుండు వీఁ డిట్టులే
నీత్తై పోవఁగ ధాత వ్రాసెనొ? కదే? నేఁ జెల్లి మల్లేశ్వరా॥ 460

మ. తలిదండ్రుల్ గుణవంతు లైన యెశలఙ్ దత్పూనుఁడై పుట్టఁగా
వలయు న్గానియెడన్ మనుష్యజని దాల్పన్ రాదయే వృక్షమో
శిలయో లేక మెకంబొ తా నగుటయో శ్రేయంబు మా కుంకలీ
కలుషానన్ జూమి? యింతగాఁ జెడుట నిక్కంబింత మల్లేశ్వరా॥ 461

మ. కొడుకుల్ దుర్మతు లైన తల్లులును బెక్కుల్ లోకమం దుందుర
ప్పడఁతుల్ గొడ్డు లౌనప్పు డుష్కృతులపై వాత్సల్యమున్ జూపి యె
క్కుడు ప్రోత్సాహ మొనర్పరట్టి దిటఁ గన్గో నయ్యోదిఙ్ వీంద్ర కీ
చెడుచెయ్యుల్ జన నీ ప్రసాదము సుమీ? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 462

మ. నను నూరేగఁగఁ జేసి రన్న సుడి కర్ణంబుల్ ప్రవేశించి యా
ఘనురా లొందిన బాధ నీ మదికె తార్కాణంబు, తత్పాద్వి యా
వను దిన్నట్టిదిపోలె? బిట్టుఱచు నవ్వాగ్వైఖరుల్ వింటివా?
యనయుల్ తత్సతి కుద్భవించుటయు దూష్యం బౌనె మల్లేశ్వరా॥ 463

మ. అలఘుల్ నన్ను సభాధిపత్యమునకై యాహ్వానముల్ సేయ మా
పలుగుంగుంకలెఱింగి యేద్దు రఁట? పాపం బీసుకున్ దాసు లై
తులువల్ దల్వని వంత లోఁ గొని యిటుల్ ఘూఘూలకుఙ్ బాత్రులై
రిలలో నస్పృల వాసి కీసు గొను వాఁ డేమౌను? మల్లేశ్వరా॥ 464

మ. చదివెన్ మొన్నటిదాఁక శిష్యుఁ డయి యే జాణ్మండు వాఁ డిప్పు డే
బెదరున్ లేక వృథాగ దూఱు నఁట నన్ బేరెత్తి. యవ్వారి త
ప్పిదమే మున్నది? వాని కట్టి చౌరవన్ బిట్టిచ్చి పుట్టించు త
ప్పిద మెల్లన్ భవదీయమే నెఱుఁగుమన్ విశ్వేశ మల్లేశ్వరా॥ 465

మ. గురునిందన్ బచరించినన్ వినరు మూర్ఖుల్ గూడ మచ్ఛిష్యుఁడే
దురితంబుం బొనరించి పుట్టెనొ నసున్ మర్భాషలాశంగ నీ

ధర నేలాదృశుఁ బుట్టఁ జేసి మిగులన్ ధన్యత్వమున్ జెందె నీ
చరితం బిందుల కేసు సంతసిలెపన్ సర్వేశ? మల్లేశ్వరా॥ 466

మ. దుర్వృత్తుల్ భవితవ్యముం గనక దుర్దుఃఖమ్మునంజేసి యం
తర్వాణిన్ దరవాణి. యం చలమటున్ దత్తేజమున్ మాన్ప మా
గర్వగ్రంథు లొనర్చు దుర్నయపుఁ బోకల్ గంటివే? పిండ్రికున్
సర్వాంగక్షురకర్మ మిప్పనుచె మూ? సంభించు మల్లేశ్వరా॥ 467

మ. తనకున్ లాభము రెండు వేలవసుకన్ దవ్యమ్ము చేకూరునం
టెనుఁ బోతన్నకు నీ కృతిప్రవర మచ్చేయైనచో వెట్టివాఁ
డను మోదించెడి నంట? కుంక యిటు తా నందాఁక సున్నం గదా?
తన మర్యాదకు వ్యాజ్య మేయఁ గలుగునా దత్త్వజ్ఞ మల్లేశ్వరా॥ 468

మ. తనకున్ లాభము నన్నవస్త్రములు విత్త మ్మాయువున్ సర్వనా
శనమున్ జేసిననాఁడె యీ కవితప్రస్తావార్హమై ప్రాజ్ఞులా
ఘనులం దెల్లెడ వ్యాప్తిఁ జెందెడి నటుల్ గాకున్నచో దీనికిన్
బనియే లే కొక మూలనే యడఁగెడిన్ బ్రాల్మాలి మల్లేశ్వరా॥ 469

మ. ఒక జాల్మం డొక సత్కవిన్ జెరకి యెన్నో తప్పుడుం దోవలన్
వెకలుల్ గొందఱు తోడుగా మెలఁగి భావిశ్రీయమే కాక తా
సకలమ్మున్ విరలమ్ముగా సమసె, నన్ చారిత్రి మిద్దానిచేఁ
బ్రకటింపంబడుఁ గార నీ కృప యథార్థం బౌచు మల్లేశ్వరా॥ 470

మ. తనకున్ వద్దిసముల్ ఘటింపఁ గల సోపర్యాల్ గరా రంటః వెం
టనె నాపైఁ దెగి తాను జచ్చె నట? నీ నామాంకితం బైన యీ
ఘనకావ్యమ్మును నైనఁ జాలఁ దెటః పింక స్పృల్లోగిన్ బ్రేలెఁ డ
వద్దినపున్ముచ్చట దీర్పకుండుటది నీదే లోటు మల్లేశ్వరా॥ 471

మ. తనకున్ వావర మైన కాలమును వర్తద్వారమం దుండి తి
ద్దినపుంగోర్కెను వాగ్వధూమణియె నిర్దేశింపఁగాదోలు. ని
చ్చినను మున్ గోరఁదె కుంభకర్ణుఁ. డిటులే దద్దిమ్మ రాఁవద్దిన
మ్మను గోరెన్ మురిపమ్ము దీర్చ యను మున్నాలింపు మల్లేశ్వరా॥

మ. మన మణా మాట "తథాస్తు" దేవత లొగిం బాటించు వారై "తథా"
స్తని సార్థక్యము గూర్చుచుందు రటన్నమా "యంబ్రహ్మ" చావల్ ఖరా
బునకున్ దక్కఁదవన్యముం దెలియమిన్ ముద్దుల్ వెసన్ పద్దుఁద
ద్దినమో తద్దినమో" యటంచుఁ గను తద్దీమత్తి మల్లేశ్వరా॥ 473

మ. పరమాభాగ్యుఁడు వీఁడు శిష్యుల నొగెన్ బ్రహ్మఋుఁ దాఁదిట్టుము
ష్కరుఁడై కొట్టఁగ కంగు, నాకతనమచ్ఛాత్రుల్ తమంగొట్ట రం
చెఱుఁగున్ నేనిక నాజ్ఞవారలకు నీవే వీని దోరింతు వం
చుర కీ వెందుల కాలసించెదవొ? నే నూహింప మల్లేశ్వరా॥ 474

మ. కుంకల్ సల్పెడి తప్పుడుం బనులు సిబ్బిం జెప్పితిన్ వీండ్రి యి
ప్పంకమ్ముల్ విని రాజరాజపురిఁ దెంపల్ నయఁ గొట్టంగ ని
శ్శంకుల్ గొందఱు సిద్ధమై రదియు దోసం బంచు వారించితిన్
మంకుంగుంకల స్వాపరాధము లెపంబాళించు మల్లేశ్వరా॥ 475

మ. ఒక విద్యార్థిని గుంకలందున ద్వితీయుం "డౌరః మా శాస్త్రి సీ
వకటా? యేరికొ చెప్పినాఁడ" వని యన్యాయమ్ముగాఁ గొట్టఁగా
నకలంకుల్ గని గ్రామపున్ ఘనులు ప్రాయశ్చిత్తమున్ జేయమి
న్నక నోర్మూసుక పెద్ద కుంక యెదిగెన్ గన్పొంటె మల్లేశ్వరా॥

శా. మా కర్మమ్మటు కాలి శాస్త్రులయెడన్ మర్యాదకున్ దప్పుటన్
లోకుల్ "తుంటరు లండ్రు మ" మ్మని కనుల్ రోరో జలంబాన దు
ష్ప్రాకుం దూరక కుంక యేడ్చె నటః రచ్చన్ బిల్వఁగాఁ బోయి యీ
సీకొట్టుం బ్రదు కేల చావఁ దగదే? శ్రీకంఠ మల్లేశ్వరా॥ 477

మ. తన దౌర్జన్యము రచ్చకీడ్చెనని మా దద్దమ్మ తమ్ముండు తో్రి
వ నెటో కాచి కలార్థిఁ బట్టికొని ఉత్పాటింతమ్మునం దెరు లే
మిని "దిక్కెవ్వరు? నీ" కటం చడిగి బల్మిన్ రేయిఁ గొట్టెన్ జుమీః
యనయమున్ దుర్మదుఁజూచి సైఁచుటయు న్యాయంబౌనె? మల్లేశ్వరా॥

మ. ప్రతి విద్యార్థిని వెక్కిరించుట మొదల్ పాపిష్ఠకృత్యమ్ము లి
ప్పతితుల్ కుంక లొనర్పఁ బూని రది నన్ బాధించు నంచెంచి దు

ర్మతు లీ తుంటరు లిక్కృతమ్మనన భస్మంబౌదు రం చేఁచలం
చితి ముమ్మాటికి నట్టులే జరిగెఁజూ శ్రీకంఠ మల్లేశ్వరా॥ 479

మ. చట్టుంబట్టుల నుండు గ్రామముల "నీ కుంకన్నలన్ గట్టిగాఁ
గొట్టంగావలె" నంచుఁ గొందఱును, "నీ కుంకన్నలన్ జెప్పుతోఁ
గొట్టంగావలె" నంచుఁ గొందఱును సంకోచమ్ములన్ వీడి బల్
పట్టుంబట్టి ఫివాల్లువైచిరి మొగాల్ వాడంగ మల్లేశ్వరా॥ 480

మ. ఇటుపై శాస్త్రిలఁ గాని శిష్యులనుగానీ మీరు మీవాండ్రు ము
న్నటి పోల్కిన్ జెనకంగఁబోవునెడ మీ ప్రారబ్ధకర్మంబు కా
లుట ముమ్మాటికిఁ దప్పదన్న పలుకుల్ కుంకల్ చెవుల్ సూడ న
క్కటా యాలించియు దుర్విదగ్ధపుగతుల్ గైకొంద్రు మల్లేశ్వరా॥ 481

మ. జరిగెన్ గుంకలయింటనేఁ దొకమహాశ్రాద్ధంబు, నన్నయ్యెడన్
బోరి దూషించుటయే యధిశ్రవణమై పోల్పారుటల్ వింటిఁ దుం
టరు లీ కుంకలయెల్ల శ్రాద్ధము లిటుల్ నా దూషణం బొప్పఁగా
జరుగుంగావుత నీ యనుగ్రహమునన్ సర్వేశ మల్లేశ్వరా॥ 482

శా. ఏ విద్యార్థినిఁ గొట్టెనో యతనియూరి కుంక తా నేగెనో
దేవా ? యంతటఁ జెప్పు చేతఁ గొని "ఛీ ? దిక్కేది ? నిన్నిప్పు నేఁ
జావంగొట్టినఁ జెప్పు" మం చడిగె మచ్ఛాత్రాగ్రజన్మండు; చా
ర్జీ వెట్టె న్మఱి దేబె నీ వెఱుఁగవే ? సిగ్గేది మల్లేశ్వరా॥ 483

మ. మగసిన్ గొట్టియు నాత్మమోహమునకున్ మల్లాడి ఫిర్యాదొన
ర్చంగ యాశిన్ బురుడించుచున్న మన యీ కుంతన్న దుర్వృత్తికిన్
దగవర్లున్ దగ మోసపోదురు ? కదా ? తథ్యేతరాలాపులన్
మొగమున్ మాడ్చవయేని నిన్నెపుఁడు నమ్మన్ దేవ? మల్లేశ్వరా! 484

శా. దుర్జాతత్వము కల్మి మా ఖలునకున్ "థూ! థూ!" లకున్, జోలి లే
దౌర్జిత్యమ్మను లేద తెల్వియును దా నామాత్రమే. యుష్టిచో
దౌర్జన్యంబె సహాయమై దొసఁగొగిన్ దాఁ జేసి చార్జీ నిడెన్
నిర్జీవం బగుఁ గాక వీనిపని వీనిన్ మ్రింగి మల్లేశ్వరా॥ 485

శా. మోకాల్నొప్పి కలార్థులన్ బెనిచి యేమోపానమున్ జేసినన్
పీఁకన్ బోయెడినంట ? కుంకన యిటుల్ పేర్లిలన్ మొదల్వెట్టె నీ
శోకం బేలొ ? కలార్థులన్ గనిన మా ఖంతన్నకున్ వీని దు
ష్పాకం బింతగఁ బండఁ దాటియు నుపేక్ష్యం బౌనె మల్లేశ్వరా॥ 486

మ. ప్రకటింపంబడెఁ గుంకపర్దనరుకుల్ పంచాయితీ కోర్టులో
వికలుండై మొక మింపి చేసికొని నిర్వీణ్ణుండునై యెల్లయున్
మొకమందే "తుఘూ ఘూతుఘూ" యరియ మా ముగ్ధుండు జీవించె దీ
వకళన్ దాసియు వీసపుట్టువు కడున్ వర్ణ్యంబు మల్లేశ్వరా॥ 487

మ. తగులంబెట్టినఁ దాతిపెట్టిన మొగాల్ దగ్ధమ్ముగావించినన్
బొగచూరించినఁ గాటిలోనిడిన, "ఛీ ? పో? నీచ? యస్పృశ్య మనుల్
దెగఁగాండ్రించిన బుద్ధిరాని ఖలులన్ దేవేశ ? యే రీతిగాఁ
బొగ రేచింతువొ ? నీకుఁ జెప్పవలెనే ? భూతేశ ? మల్లేశ్వరా॥ 488

మ. ఒకకొన్నాళ్లిది గ్రామదోష మని నే నూహించితిం గాని యీ
వెకలుల్ "దుర్భగు" లం చెటింగి పిదపన్ వీసమ్మునుం గ్రామ మా
త్మకుఁ దప్పబ్బు నటుల్ చరింపమి నిఁకన్ దద్దోష మం చిందు వ్రా
యక నీ దోస మటంచుఁ బేర్కొనెదఁ దత్యంబింత మల్లేశ్వరా॥ 489

శా. ఐదయ్యేన్ శతకమ్ము లట్టుడికినట్లై యెప్పు డింకెప్పు డీ
మా దర్పోచులు రూపుమాయు"టని గ్రామంబాగ్రిహోదగ్రమై
నీ దిక్కున్ గనుచున్న దేకతమొకో ? నీ పూరకున్నావు మ
ర్యాదాహీనుల రూపుమాపుట యకార్యం బౌనె ? మల్లేశ్వరా॥ 490

మ. అవమానంబులు లెక్కసేయ రని నీ యాంతర్యమే పూర్తిగాఁ
దవి చూచెంగద ? యెందఱెన్ని గతులన్ "జాచాలు ఛీ ఛీలు, మున్
దవులన్ జేసిరి "దున్నపై చినుకులై" తత్సర్వముం బోయె ని
క్షా వీకి న్నికుసు దిక్కఁగావలయు లోకఖ్యాతి మల్లేశ్వరా॥ 491

మ. ఇటుకల్ కాలిచి యమ్ముకో లనఁ గడున్ హేయాతిహేయమ్ము మా
రటకుల్ దీనికి నగ్గమై రిది మహారణ్యమ్మునం గాచ నం

కట మీ దుష్కృతి గ్రామమధ్యముననే కల్పించినార్గోతు లె
న్నటికిం బూడ్చెదొ? యీ చరిత్రవిదులానందింప మల్లేశ్వరా॥ 492

మ. మును పగ్గాధిజు యాగముం జెరిచి రమ్మూర్ఖాగ్రణుల్ పారశా
లను శర్ధించుటలోసుగాఁగలుగు నైర్ల్యజ్ఞప్రియుక్తమ్ము లౌ
ఘనకార్యమ్ములు మా యనామతరువుల్ గావించి రే తత్ఫలం
బును వీండ్రన్గుడిపింతువో? గుడుపవో! మోమోడి మల్లేశ్వరా॥

శా. మోమోడన్ బని యేమి నా కనెదొ? మా మూర్ఖాగ్రణుల్ నీదు స
ద్ధామంబందున నర్చకాధమునకున్ దాస్యమ్ము గావించుటన్
బ్రేమం బించుక నీకుఁ గల్గెనని యుత్ప్రేక్షించితిన్, దుష్కథా
స్తోమంబుం బరియింప నిట్టి సొబగుల్ చూపట్టు మల్లేశ్వరా॥ 494

శా. విద్యాన్యక్కృతి, తద్గధిక్కృతియు మా వీటిండికుంకల్ సతం
బుద్యోగమ్ముగఁ గొంటపున్ ఫలము మూలోన్మూలనంబౌటయే
"సద్యంబో? యది వేతౌకష్టా" యనినన్ శక్యంబె చెప్పంగ నా
పద్యుక్తిన్ ఘటియించి తీరు నెపుడో పాపంబు మల్లేశ్వరా॥ 495

మ. విధవల్ లే రని కాదు గాని మఱి మా వీటిండి కుంకమ్మలన్
బ్రథమోదాహృతికై చతుర్థుఁడు జనింపం బోలు నేతాదృశం
బధమత్వ మ్మిఁక నొక్కచో నరయఁబో మక్కుంక విద్యార్థులన్
వృథగాఁ దిట్టెడి వాని పొం గణపవే? విశ్వేశ మల్లేశ్వరా॥ 496

శా. కుంకల్ వెంకయు నీదు నగ్రముననే కూర్చుండి జూదంబు ని
శ్శంక ప్రక్రియ నాడుచుండుటకు నే స్వాంతమ్ము లజ్జింపదే
యింకన్ దైవమ వెట్టు లయ్యెదవు నీ విప్పాపులన్ సైఁచుచో
నింకింపంగదవయ్య? శీఘ్రముగ దుష్కృత్యంబు మల్లేశ్వరా॥ 497

శా. జూదం బాడుట కూటసాక్ష్యములు సత్పూరిద్విషద్భావ మ
ర్యాదాభావకృతఘ్నతాగరిమ ముఖ్యమ్ముల్ గదా? ఏండ్రి స
ర్వాద్యాయమ్మును జన్మకర్మములు నీ వర్జించి చర్చించుచో
బూదెన్ జేయుట కేమి శంక యిఁక శంభూ? దేవ? మల్లేశ్వరా॥ 498

శా. గాత్రిమస్థుల్ పరిహాద్దినూళ్ళపత్రిజలున్ గట్టుక్కాతో లేచున
ష్టేమేమో చెడుకర్జములల్ సలిపి యా యీ భీతి జీవచ్ఛవ
పాత్రిముఖ్యంబు సహించి యిప్పు డెచటన్ వా విప్పుటల్ లేమి,పో?
మోముల్ పూర్తిగ మాడెఁ గుంకల యఘమ్ముల్ పండె మల్లేశ్వరా।

మ. ఇఁక సిష్టే పసఃకప్పుడుం గయితతో నీ నన్ను దూషించుచున్
వెకలున్ గుంకలలోఁ దృతీయుఁడు రుషావేశమ్ముమై గన్నుగా
నెక పొంగున్ గడు బోరఁగిల్లఁబడెడున్,నా శిష్యుడై నన్నుఁ దా
నెకసక్కెమ్మటు లాడఁగొంకఁడొ కదా?యీ శుంఠ మల్లేశ్వరా॥ 500

మ. గురునిం దూఱుట తండ్రిఁగొన్న నవలాకూటంబు గైకొంట,త
స్కరతాముష్కరతాకృతఘ్నతలలోఁ జాతుర్యముం గొంట,సు
స్థిర మశ్వత్థము త్రుమ్మచెట్టుకరణిన్ ఛేదించుటల్ లోసుగా
చరితమ్ముల్ పొనరించు దుర్భగులు వధ్యుల్ గారె?మల్లేశ్వరా॥ 501

మ. గురునిం దూఱుట లోసుగా దొసఁగు లిక్కాలశల్ నిరాతంకము
ష్కరతన్ జేసి యొనర్చి రియ్యవి భవిష్యద్దుర్గతిన్ సర్వతః
పరిభావమ్ము నెఁ దెల్పినన్ గనక మా భగ్నాయతుల్ శిష్యులేఁ
గురు నన్నున్ గురు వెక్కిరించెదరు గన్గోపయ్యె? మల్లేశ్వరా॥ 502

మ, నను దూషించుచుఁ జెప్పుపద్యమున నే నాశంబు మచ్ఛిష్యునె
త్తిని నిల్పెన్ "గులనాశన" ధ్వనియు నర్థిన్ దానఁ దోఁతెంచె నా
శనకాలం బవి దగ్గఱంబడుటయే సత్యంబు గా వచ్చు సూ
ర్యునిపైఁ జల్లిన ధూళి కన్నులఁ బడెన్ రోషించి మల్లేశ్వరా॥ 503

(విరోధిజా ధాతులనాశనాదిమహిమాన్వితము)

మ. మొదలంటన్ బరిభూతిసాగరమునన్ ముమ్మాటికిన్ ముగ్గి మా
పదసుంటోతులు సిగ్గు లేమి మరలన్ వా విప్పుచున్నారు దు
ర్మదు లీ తుంటరు లీ పరాభవములన్ మన్నింప రాకొక్కనిన్
చుదముట్టింప గదయ్య?శర్విధ్రమెయి నుద్యోగించి మల్లేశ్వరా॥ 504

మ. పరమాపూయను మగ్గి మా జనులు దుష్ప్రారంభులై దేశికున్
బరిహాసం బొనరింపఁ బూనియు నధఃపాతిత్యమున్ గాంచి పొం
గఱకే నిల్చిన నేను నత్త మదిలో హత్తింపఁ దెవ్వాఁడు న
త్వర సీ వాపము రూపుమాపి జగమున్ బాలింపు మల్లేశ్వరా॥ 505

మ. అదఁ గొఱ బాచకు వాయు కుంకల మొగా లత్యంతమున్ మాడెఁ దా
మది నెన్ తెంకయుహమ్ము నల్గురల గాధ్రిని మ్మాగ్రహోదగ్రమై
తడుపన్ జొచ్చెను గోమయోదకముతోఁ దద్వాటికిన్ సోఁగి ప్రమా
న్నదుటన్ గుర్రిక్కిన పేలచందమున నున్నారిప్డు మల్లేశ్వరా॥ 506

మ. లనమున్ జోక్యము లేనివానివలె వాలాయమ్ము గన్పట్టి దూ
రవులన్ గుంకల నాఁడునాఁటికిని దౌర్బల్యమ్మునన్ ముంచి మా
నవతాదూరులఁ జేసి చంపితివి పాణం బున్న నే మయ్యెడిన్
శవముల్ మే లనిపించు నీ చెయిది కాశ్చర్యంబు మల్లేశ్వరా॥ 507

శా. సర్వస్వమ్ము హరించి తెంకకు మనశ్శల్యమ్ము సంధించి తం
తద్వైరమ్మును గూడుగుడ్డలయెడన్ దారిద్ర్యముం గొల్ప మా
గర్వగ్రంథులఁ గుంకలన్ జదిపి తక్కంకోత్సుకం బాచకున్
గీర్వాణమ్ము డఁగించి కూర్చితి నిసుం గీర్తింతు మల్లేశ్వరా॥ 508

శా. దేవస్థానపు రాలు సన్నమదిలోఁ దీపంతగా వేదు గా
నీ విజ్ఞుల్ పరికించి చూచినయెడ న్నిర్ణాయకుల్ పాజ్ఞులై
భావం బెక్కడ రెంద తెన్ని గతులన్ భ్రష్టాత్ములై యర్చకుల్
దేవద్రోహ మొనర్చు చుండరా? వినిర్దేశింపు మల్లేశ్వరా॥ 509

మ. "తరవాణీ? తరవాణి" యంచు గురునిం దాఁ బక్కనన్ నవ్వితి
ప్పరిహాసంబొ మతొండొ హేతువుగ దుర్వారజ్వరావిష్టుఁడై
పరిశీలింపక కుంకలం దొకఁడు తర్వాణిం దెగం ద్రావుటన్
జరిమావస్థకు వచ్చె నయ్యది మహాశ్చర్యంబు మల్లేశ్వరా॥ 510

శా. బుద్ధిన్ జెప్పితి వింక దుర్మరణమున్ బొందింప కీ వింతతో
నద్దుఃఖమ్మున నుండి పోర్చునెడ నీవ్నే కాక నన్ గూడ యా

వద్దేశమ్ము నుతించుఁ గర్మ మది దుర్వారం బటంచన్న నా
పద్దైవంబవు కాకపోను విధి దుష్ప్రఖ్యాతి మల్లేశ్వరా॥ 511

మ. అఖిల గ్రామముసూతఁ గుంక లతిమర్యాపారులై యుంటచే
సుఖ మివ్వాండ్రకుఁ గల్గు టొప్పదు పరాసుత్వమ్మె వాంఛించు నో
ముఖవిధ్వంసక! యట్టు లయ్యు "సుఖ మిమ్మా" యంటి "సర్వేజనా
స్సుఖినస్సం" తను మాట కర్థమును సంశోధింపు మల్లేశ్వరా॥ 512

శా. కొట్టం గూడదు దేనినే నొకతటిన్ గొట్టన్ బ్రవర్తించినన్
గొట్టన్ రాను దరంబుమీఁద నని ప్రాజ్ఞుల్ వల్కుదుర్ సర్వథా
చెట్టల్ వీండ్రని నే నెఱింగియు నినున్ జేసాచి యాచించెద
న్నట్టేటన్ బడి మున్గు కుంక కనుదానం బిమ్ము మల్లేశ్వరా॥ 513

మ. మును పప్పోతనరేంద్రు దౌష్ట్యమున భీముం డాగ్రహోదగ్రుఁడై
తన యశ్వమ్మును సీతఁ జేసె యొక పద్యంబల్లి జాఁదిట్టి పో
తనయర్ధాంగి ననుగ్రహించి మరలన్ దాఁ ద్రిప్పె శాపంబు పో
తన జీవించె యశోధనంబు కవికిం దా నిల్చె మల్లేశ్వరా॥ 514

మ. ఒకచో దుష్టుల దౌష్ట్య హేతువునఁ గోపోద్రిక్తులై సత్కవుల్
స్వకవిత్వమ్మలవాండ్ర నష్టికొఱకై సాఁగించియున్ దత్ఫలం
బు కడుం దాపగుపట్టునన్ సదయులై బ్రోవంగ నుంకించుచే
సుకవీశత్వపు గుర్తగున్ మదిని సంశోధింపు మల్లేశ్వరా॥ 515

మ. నను నిందించునుగాక నా యెడలఁ బూర్ణద్వేషముం బూనుఁగా
కనయంబుల్ శత మాచరించి నను హేయాలాపముల్ గూయుఁగా
కనుమోదించితి నంటి దప్పులకు నే నన్నింటికిన్ వీని దు
ర్జనతం జూడక మృత్యువున్ దొలఁచి సంరక్షింపు మల్లేశ్వరా॥ 516

మ. మొదలే లేవనుకొన్న నీదు కళ యుమ్ముగ్ధాత్ములన్ గట్టిగా
బెదరించెన్ బయి కేగనీకు మిఁక నా విజ్ఞప్తి మన్నించి యీ
పదరుంబోతు ననుగ్రహించి యెటులో ప్రాణమ్ముఁ గాపాడు మం
త్యదశన్ ద్రిప్పుము నీకు నాటను యశం బార్జింపు మల్లేశ్వరా॥ 517

శా. తత్సోదర్యుఁ డొనర్చె ము న్నెఱుఁగవే? "తర్వాణి పద్దెమ్ములన్
వత్సా? తన్ముఖపద్యమం దొదవె దుర్ధ్వానంబు. తద్దోష మా
పత్సంపాప్తికి మూల మం చనెదొ? యావద్దోషముల్ వాపి నీ
యుత్సంగమ్మున వీని నుంచికొని యాయు స్సిమ్ము మల్లేశ్వరా॥ 518

మ. ఎచట న్నన్ను నుతించువారె జగతిన్ "హీహీ"లు నన్ గూయు దు
ర్వచనుల్ గానఁగరారు,వీండ్రి నెటులో రక్షించి నన్ వీండ్రు త
దర్చనార్థం బుపయోగ మౌదు,రది తద్దన్ నన్నుఁ బేర్చిరేచి ప
ద్యచయంబున్ భవదంకితంబుగను జేయంజేయు మల్లేశ్వరా॥ 519

శా. మీసాల్ దువ్వి కలార్థులన్ జెనకుచున్ మృత్యర్థమెంతేనియున్
జేసెన్ వీఁడు ప్రియత్న మయ్యది వెసన్ సిద్ధించు కాలమ్ముతా
నాసన్నంబును నయ్యె నట్టితఱి ని న్నర్థించితిన్ వీనికై
దోసం బున్నను సైఁచి మన్చితివి సంతోషంబు మల్లేశ్వరా॥ 520

శా. ఏ నీచుం డటు మిట్టిమిట్టిపడెనో యీ నాయెడన్ వాఁడిదే
పో నుండెన్ మఱి యొక్క యూరి కిచటన్ బో నానకున్ గాకొగిన్
"గానన్ లేక దురాయతుల్ చెడుట కిక్క ష్టాత్ముఁడే సాక్షి యం
చీ నిశ్శ్రీకు జనుల్ హసింతు రిఁక "హీ హీ "యంచు మల్లేశ్వరా.

శా. ఏ భూమిన్ గొని నెట్టపంటకలహం బీ దేబె కల్పించె నో
యా భూమిన్ గతిమాలి మొన్ననె సుమీ? యమ్మెన్ ఋణార్థమ్ముగా
నీ భాగ్యమ్మున కెందుకో గద యటుల్ హేయమ్ములన్ గూయుటల్
లాభం బిట్టిది యుండ నెట్టులు సుశీలం బబ్బు మల్లేశ్వరా॥ 522

మ. ఘటియించెన్ స్థలభాండశుద్ధి తుదకున్ గ్రామానకున్ దూరమై
యెటకో పొట్టను జేతఁ బట్టికొని పోయెన్ గుంక, లెంకన్న సం
కటపా టన్న ? నవర్ణనీయ మఖిలాంగ క్షౌరమే యయ్యె న
క్కుటిలున్ బాచకునింక నొంపవలయున్ గ్రూరాత్మ మల్లేశ్వరా॥

శా. వీనిన్ దుశ్చరితుల్ దురుష్యము ఖలుల్ వీసంబు శిక్షింప వీ
హీనాలాపుని నోటికన్న మఱి యెన్నేరెట్లు విప్పంకిల

స్థానంబే బహుమానపాత్రి మిది తథ్యం బంచు నీ బుద్ధికిన్
గానన్ వచ్చియు నేదకో గద? యుపేక్షాబుద్ధి మల్లేశ్వరా॥ 524

మ. త్రిటయం బేర్పడె గ్రామమం దఘము నుద్దీపింప నందిర్యురల్
వెతలం గుడ్పితి గ్రామపాచకునకున్ వీసంబునుం గూడ బా
చితమున్ జేయవు వీని దుర్నయము నీ చిత్తానకున్ రాదొ; యి
ప్పతితుల్ గూర్చి యుపేక్ష సేయుట మహాపాపంబు మల్లేశ్వరా॥

మ. చదువున్ వీడు "పురాణ"మం చవల లజ్జాహీనతల్ జేసి యే
బెదరున్ లేక "తదర్థ" మంచు నొడువున్ విద్వాంసు లా వీధిబో
వుదురేనిన్ మఱి కొంత బిఱ్ఱబిగియున్బో? "మీ యెడల్ భీతి నా
యెడ లేశమ్మను లే" డటంచు దెలుపన్ హీనుండు మల్లేశ్వరా॥526

శా. ఈ చండాలుని కంఠమాధురియు నీ హీనాత్ము వాగ్ధాటి, యీ
నీచాలాపుని యర్థవైఖరియు నీ వేనాడు నాలింపలే
దో చంద్రాభరణా? యొకింత వినుచో నుల్లమ్ములో మండి నీ
వే చెప్పుం గొని చావ గొట్టెద వటంచే నెంతు మల్లేశ్వరా॥ 527

మ. "ఇది నా దక్కను రా బ నే మటులు నీవే కొట్టగా రాదె యీ
పదరుంబోతు" నటందువేమొ,యురకే వాకుచ్చితిన్ గాని చె
ప్పెదిలో గొంకెదివీనిపైకిజన,నీ హీనాత్ము డాత్మీయదు
ర్మదిమున్జేసియె స్వల్పకాలమున భస్మం బౌను మల్లేశ్వరా॥ 528

మ. ఇపు డీ గాడిదకొడ్కు బ్రాహ్మణుని.నా మ్మేమంచు బెల్లమ్ముగా
నెప మేదో సృజియించి మెక్కెడినొకో?నీ లెంక మా కుంకయున్
గపటుల్ బాసటగాగ, నిట్టిపనికిన్ గష్టమ్ము నీ చిత్త మం
దెపుడుం బోపదె?నిక్కముం దెలుపు మో యీశాన మల్లేశ్వరా॥ 529

శా. ఈ సౌ మ్మంట?త్వదర్థమై వ్యయము నా యీ తుంటరుల్ సేతు రం
టీ సౌజన్య మెఱింగితే?యకట?నీ విద్దానిచే నెంత సం
తోసం బఁదెదొ వాం డ్రెయుంగుదురు నీతో నాకు వా దేల? యీ
కాసున్ జేయని పాచకాధము నెటో గాఱింపు మల్లేశ్వరా॥ 530

మ. భూమిస్వామిద్విజుండు, గొల్లరయి, తమ్ముగ్ధున్ దురాలోచనా
కాముంగా నొనరించి గాఢగౌడుకుల్ గాఁజేసినా ర్భూమి.నీ
సేమంబుల్ మది నెంచి యే యగు నొకో? సేబాసు? కైంకర్య మో
స్వామీ? నీ కెటువంటి దబ్బినది? యాస్వాదింపు మల్లేశ్వరా॥ 531

మ. ముగుపున్ గూడి యొనర్చు దుష్కృతుల నామూలమ్ము నీ చిత్త మె
క్కఁగ నేఁ జెప్పితి నందు నిష్ఠుర నొగిన్ గారించి తప్పాచరున్
బొగ రేదింపవు.వీను దీనిఁ దనియా?ము న్నట్టిఁడే యయ్యెదు
ర్భగుఁ డిం కీవృషుఁ డుండఁ బోఁ డనుచు సంభావింపు మల్లేశ్వరా॥ 532

మ. కల రెండున్ మొగ మెల్లఁ బేరితకళగాఁ గన్పట్టు దుష్పాచకుల్
ఖలు లామాత్రిముచేతఁ గారు మన యీ కళ్ళన్నగాఁ దన్ననో?
పలుగుంగాడిదకొడ్కు, వీని ననుకంపన్ జూడఁగారాదు చి
క్కులపాలున్ బొనరించి కర్మఫలమున్ గుడ్పింపు మల్లేశ్వరా॥ 533

మ. నలుగన్ దన్నెద మందురి శిష్యు లచట న్నాయాజ్ఞ లేకుండె నీ
యలఁతి న్నీవు నుపేక్షచేసెదవు, దుర్వ్యాహారుఁడై వీఁడు దు
ర్మలినంపున్ మరణంబు వాఁతఁ బడు నమ్మాడ్కిన్ దెగన్ బ్రేలుఁ ద
త్ఫల మైనన్ గుడిపింపు శీఘ్రముగ విద్వద్వంద్య మల్లేశ్వరా॥ 534

శా. మీసాల్ దువ్విన దున్నపోతు కొడుకున్ "మీఁదెట్టు క్రిందెట్టుగాఁ"
జేసెన్ గ్రామము వెల్వరించె మఱి తజ్జ్యేష్ఠున్, మఱిన్ దెంకనో
పైసాకున్ గతి లేక యేడ్చుగతిగా బాధించె నేహేతువో?
దోసంపున్గనిఁ బాచకున్ మిగిలిచెన్ దుర్వృత్తి మల్లేశ్వరా॥ 535

శా. ఇంకన్ నిందవొ వీని దుర్ణయము లీ యేవంపుఁ బెస్గుట్టకున్
బంకంబే యభివృద్ధి కారకమొ? యిప్పాపుండు శ్వానంబు, నీ
లెంకన్ సుంకను బైని జూచికొని యెట్లేఁ బేరిలుటన్ వీందరినే
యింకింపన్ దొరకొంటివో? తెలుపు మో యీశాన మల్లేశ్వరా॥ 536

శా. లేశం బేనియుఁ బాపభీతి మదిలో లే దీ దురాచారు నం
దీ శుంఠన్ మడియింపఁగా వృథగ నీ కే లయ్యె? సందేహమో

యీశా? మూగురలోన నిర్వుర నెటో యింకించి తీ దుర్వచః
కోశు న్నాశ మొనర్చి పేర్గానుము లోకుల్ మెచ్చ మల్లేశ్వరా 537

శా. ఈ లంబ్జీకొడు కెంత దుర్భగుఁడో నీవే చూడుమా భూమి తా
నేలా స్వీకృతి చేసె ? గొల్లఁ డెవఁడా యీ బ్రాహ్మణార్థమ్ము తా
నీ లుంటాకున కమ్మి వేయుటకుఁ దా నెవ్వాఁడు కైకొంటకున్
గాలుష్యం బిది చాలదే? ఖలు నడంగన్ జేయ మల్లేశ్వరా॥ 538

మ. అపవిత్రున్ రిపుఁ బాపుమాపుటకు నీ వాలోచనల్ సేసె దీ
శ్వపచాకారుని మోర చూచునెడఁ బాపం బబ్బునో లేదో నీ
వ పరీక్షించి వచింపు మిట్టి ఖలు నేలా నీవుపేక్షించె దీ
కృపణున్ శిక్షకుఁ బాత్రుఁ జేసి వెసఁ గీర్తిం గొమ్ము మల్లేశ్వరా॥

శా. కుంకల్ పూర్తిగ మాడిపోయిరి యవాకుల్ పేలి పేలించి వీ
లెంకో? సర్వవిధమ్ములం జెడి సురాశింపంబడెన్ బాచకుం
డింకన్ రూపఱలేద వీని కొక లెక్కే? యూరి చీవాటు లీ
ఱంకుంగాడిద కెట్టిశాస్తియు నపర్యాప్తంబ మల్లేశ్వరా॥ 540

శా. ఎంతో కాలము పట్టునంచు మదిలో నే నెంచితిం గాని య
త్యంతక్షిప్రగతిన్ నశించిరి రిపుల్ ధర్మేతరారంభులై
వాంతుల్ చేసిన పాచకాపశదు దుర్వక్త్రాన కన్నోదకా
క్రాంతిన్ దూర మొనర్పవేని నిను నేఁ గైకోను మల్లేశ్వరా॥ 541

మ. ధర "నత్యుత్కట పుణ్యాపాపములకున్ దత్తత్ఫలావాప్తి చే
కుఱు నీ లోకమునంద" యన్న సుడి మా కుంకమ్ములందే కడుం
జరితార్థమ్మటు మిట్టిమిట్టిపడి నిచ్చల్ కూటికిన్ గుడ్డకున్
గఱవై పోయిరి శీఘ్రకాలముననే కష్టమ్ము మల్లేశ్వరా॥ 542

శా. ఏ గుర్క్రుంకలుగూడఁ "జెట్టుకొకఁ"డై రిల్వాట్టె నొక్కండు మా
రోగుం డొక్కరుఁ డయ్యె వీఁడు మిగులన్ గ్రూరుండు కుంకల్ మఱి
లాగే నేఁడు స్వయంకృతాఘముల వాలాయమ్ము డీలైరి, తా
మాగం డింతకుఁ బాచకుం డఘములన్ మ్రిగ్గండు మల్లేశ్వరా॥ 543

మ. తల కొక్కెరుగఁ గుంక లేగుకతనన్ దారిద్ర్య మీ యూరికిన్
దొలఁగెన్ బాచకగార్దభం బొకరుఁ డిందున్ బాతుకున్నాఁడు క
శ్మల మివ్వాని మొగంబు చూడఁ జన దీ చండాలునింగూడ న
వ్వలికి న్నెట్టితి వేని గ్రామమున కౌ భద్రంబు మల్లేశ్వరా 544

శా. పిక్కల్ నాలుగు గాడ్దకొడ్కున కెటో పిత్రార్జితం బబ్బె నా
రొక్కం బుంట మఱింత హెచ్చి ముదిరెన్ రోగంబు నానాఁటి కీ
కుక్కన్ బెల్లుసి కొల్పినట్టి ఖలులన్ గూపెట్టఁగాఁ జేసి తే
లొక్కోఁ? యీ జననిందితున్ విడిచి తోహో? దేవ మల్లేశ్వరా 545

శా. నీ తాత్పర్యము "ప్రేరకత్వమె కడు న్నింద్యంబు కాఁబట్టి యా
చేఁతన్ జేసిన కుంకలెంకల నొగిన్ జీవచ్ఛవత్వంపుఁ బె
న్గోతం బూడ్చితిఁ జాలు" నంచుఁ గలదో? క్రూరాత్ముఁ డీ నీచునీ
వీ తుచ్ఛున్ మథియింపఁగావలెఁ జుమీ? యెప్డేని మల్లేశ్వరా॥

శా. కుంకల్ నాశన మొటకున్ సకలలోకుల్ గూడ మోదంబుతోఁ 546
జంకల్ తట్టుచునుండి రీ జడుఁడు దుస్సంచారియై లేశమే
నింకంబాఱమి కెల్లరున్ గనలి నిన్నేమందురో నీ మనః
పంకేజమ్మునఁ జూచుకొన్నయెడ విస్పష్టంబ మల్లేశ్వరా॥ 547

శా. ఏ దే నొండు గుణంబు చూపిన సరే యీతుచ్ఛునం దట్టులే
కా దే నీ మసిచేసినన్ సరియె యీ కష్టాత్మ దుర్వృత్తికిన్
బా ద్దైయుండియుఁ దత్ఫలం బనుభవింపంబోక యీ దేబె నిః
షేదం బౌనెడలేఁడు దేవుఁడనరే? కీ లెంచు మల్లేశ్వరా॥ 548

శా. తప్పుల్ లోకమునం దనేకము లసత్యంబున్ గృతఘ్నత్వమున్
గొప్పన్ గొంచెముఁ జూడ కూరక యవాకుల్ ప్రేలుటల్ లోనుగాఁ
దప్పుల్ మిక్కిలి పెద్ద వీ జడున కే తద్దోషమే విస్తృతం
బిప్పాపున్ క్షమియించి తేమి కతమో యీశాన? మల్లేశ్వరా॥ 549

మ. ఎపుడు న్నోట నమంగళంపునుడులే యీ దేబెకున్ వచ్చు నే
నిపుణత్వంబును లేక యుండియుఁ గడు న్నిక్కున్ దెగన్నీల్గు నీ

శ్వపచుం డాడెడి మాటలందుఁ గల దౌర్భాగ్యంబు నేనీ గత
త్రిపుఁ గుడ్పింపుము దాన వీ డుడిగెడిన్ ధార్ష్ట్యంబు మల్లేశ్వరా॥ 550

శా. నా కాశ్చర్య మెలర్చు 'నే' ననినచో సమాశ్రితనమ్రుండుగా
భీకంపమ్మున మూలలం దొదుగు నీ పెండేల దేపయ్యె నేఁ
డీ కుంకమ్ముల పేరిణమ్మున ననున్ హేయాతిహేయమ్ము రా
వాకుల్ దోకెడి పీని మాపని కవిత్వం బేల ? మల్లేశ్వరా॥ 551

మ. కవనం బన్న దురాత్మునిం గెవప యోగ్యాగ్రిమణిన్ బెంపఁగాఁ
బవి పీయూషము పై చెలంగు నెడలన్ భాషావిదగ్రేసర
స్తవ పాత్రం బగు నెట్లొ కష్టపడి పాత్రిసల్ విశ్రమంబుల్ పొరిన్
దపులన్ గూర్చిన యంతమాత్రన కవిత్వం బౌనె మల్లేశ్వరా॥ 552

మ. కవి కీ యూరొనరించు పుణ్యమునఁ గుంకల్ పంచబంగాళమై
యెడఁగాఁ బోయిరి భూము లమ్మికొని యుండే యుండెఁబో? తెంక తా
నడుగంటన్ దెగమాడి వాచకుఁడు సాహాయ్యమ్మిటుల్ వోయి ప్రే
యుడు చాలించెను బ్రస్తుతం బొదిగి జాల్యం దయ్యె మల్లేశ్వరా॥ 553

శా. ఈ మాత్రమ్మున "వీఁడు యోగ్యుఁ" డని నీ వేలా గుపేక్షించితి
వో? మూఢుండు దురాశయుండు దురితాయుష్కుండు దుశ్చేష్టుఁడీ
ధూమాస్యుం డతినీచుఁ డిచ్చెనఁటి కేదో శిక్ష గావించి మ
త్సామర్థ్యమ్మునకున్ ఘటింపుము జగత్ప్రఖ్యాతి మల్లేశ్వరా॥ 554

మ. "ఎనఁ డివ్వా?" డల వేంకటేశ్వరకవిన్ హీనోక్తులన్ గూయుదు
ర్భవుఁడీ దుర్దశ కేమి కారణము ? దూరం బారయన్ లేక య
క్కవిపై కేగుట గేలిసల్పుట యిటుల్ ఖండించి యాబాలమున్
గవితాగోష్ఠులయందుఁ జెప్పికొనఁగాఁ గావింపు మల్లేశ్వరా॥ 555

మ. దొసఁ గివ్వాని దుపేక్ష్య మెట్టులగు ? నీ దుర్మార్గుఁ డావంతయున్
గసుగందండు సహాయులో చెడిరి దౌర్గత్యమ్ముపాలై చెడుం
గసరుల్ దిట్లును నూరిచేఁ దినియె నీ కంకోష్ఠ మీ తిట్టు లి
క్కసవున్ మేసెడి కాఁబుదున్నకొక లెక్కా? తెల్పు మల్లేశ్వరా 556

శా. వేదాంతమ్ముల నెంచిచూచిన రుడావిర్భూతి తప్పే నిజం
బీ దుర్జాతు దురాగతమ్మునెడ నాకే కాదు నీకేనియున్
రాదా? క్రోధము మిట్టిమిట్టిపడె నీ రాండేయుఁడా మిట్టిపా
టా పుర్భాషలు నూరకే చనుట యన్యాయంబు మల్లేశ్వరా॥ 557

మ. కవియన్నన్ ఋషియంశమే కద? ఋషుల్ కంగోష్ఠులన్ మాపఁగా
స్వవివేకమ్మున కీడుగానిరుషతో సాంగత్యముల్ సేసి రం
చవలోకింతుము గ్రంథరాజములలో నస్మాదృశుల్ క్రోధమున్
దవులన్ ఎప్పటులయ్యెడిన్ గుజనులన్ వండింప మల్లేశ్వరా॥ 558

శా. స్వగ్రామమ్మిది నాకు నిందుఁ జిరవాస్తవ్యున్ మహీయః కృపో
దగ్రున్నన్ గుఱిచేసి యింతదసుకన్ దాత్పర్యపర్యాప్తిమై
నే గ్రంథమ్ము రచింపలే దనెడి యా యీ లోపమున్ దుర్గుణ
వ్యగ్రుల్ తీర్చిరి కుంక లెంక లిది నుత్యర్హంబ మల్లేశ్వరా॥ 559

శా. శాపార్థమ్మిది పుట్టె దేవునకు నీషన్మాత్రి సంబంధమే
యీ పద్యమ్ములయందటన్న నిజమే యీ పొత్తమే కాదు ము
న్నే పొత్తమ్మునఁగూడ దేవునకు నింతే గోప్యత ప్రాయమై
యాపాదించు నిదే పవిత్రితను గావ్యం బెల్ల మల్లేశ్వరా॥ 560

శా. సంకల్పించితి నీ నిమిత్తమున నీ సత్కావ్య మల్లంతలోఁ
గుంక ల్లెంకయుఁ బాచకాపశదుఁడున్ గోపంబు హెచ్చించి బల్
పంకంపుంబను లాచరించి రటుపై వర్ధిల్లె భావత్కనా
మాంకం బూరకపోదు వృద్ధి కిరవై వ్యాపించు మల్లేశ్వరా॥ 561

శా. ఇండున్ జాల్ముల దుష్టచేష్టల నెటో క్లిష్టీకృతిన్ జేసి నే
ఛందోబద్ధముగా నొనర్చితి ద్విషత్సాహాయ్యమే లేనిచో
వందే కాకిటు షట్పుతంబు వఱకున్ వ్యాపించునే పద్యముల్
ఛందోభాషల కేమి శత్రుకృతమే సర్వంబు మల్లేశ్వరా॥ 562

మ. అగుచు న్నేను మహాశుధారకవితావ్యాసంగి నట్లయ్యు య
త్నగతిక్ జెప్పెడుపట్ల నిక్కమ సుమీ? నాతండ్రీ? వాక్రుచ్చెదన్

బగలున్ రేయియు నొక్కపాచమునకే పట్టున్ ద్విషద్దుష్కృతి
స్థగితం బియ్యది వీఁడు కేవలనిమిత్తం బిందు మల్లేశ్వరా॥ 563

మ. సుతునారోగ్యము సంస్కరించినది నీ శుద్ధాంత మీవో? మహా
పతితాపాయ దురామయమ్ము కతనన్ బాడైన గ్రామంబు సం
స్కృతమున్ జేసితి వించుమించుగ నిఁకన్ శేషంబు నిశ్లేసు సం
స్కృతిమున్ జేసితి వేని గ్రామమున కౌ శ్రేయంబు మల్లేశ్వరా॥ 564

శా. ఈ కుంకమ్మలు గ్రామమున్ విడిచి రింకీ పై దురంతమ్ములౌ
పోకల్ వీడుదు రంచు సంతసిలి రావ్రుల్ కుక్కయొక్కంట గౌ
రీ కళ్యాణము పాడునే? యనటి చార్జీలందు దుష్కూటపున్
సాకి ళ్లీ చెవలమ్మలే యెఱుఁగు మీ చందమ్ము మల్లేశ్వరా॥ 565

మ. కవిరాజీ గతి వ్రాసె ధర్మపరుఁడౌఁగా? సూర్యనారాయణ
ప్రవరుం డా గతి వ్రాసె వీంద్రమెడలన్ వా రేల ద్వేషింతురో!
శివ? నీవే పరికించి యీ చెనఁటులన్ జేడ్పాటులన్ ముంచి స
ర్వవిధాలన్ ఖ్యాతి గూర్చి మాపుటయె కర్జంబయ్యె? మల్లేశ్వరా॥ 566

మ. అపసాక్ష్యమ్మును లెంకయన్న కౌఆకై న్యాయాధికార్యగ్రమం
దుపరప్రాప్య మొకింతయుఁ గనక యాయుఃకార్శ్యమున్ జూడ కీ
విపరీతుల్ మన కుంక లిచ్చిరి గదా? విశ్వేశ? యీలాటి దు
ష్కపటుల్ వర్తిలు చోట సజ్జనుల కస్వాస్థ్యంబు మల్లేశ్వరా 567

శా. ఎన్నో దుష్కృతులం బొనర్చి తుదకా యీ యూరికిన్ దూరమై
యన్నార్థం బొక గేస్తునింట శునకంబై యుండి యేవం విధా
పన్నత్వమ్మున మ్రగ్గి పాడఱియు మా భ్రష్టుండు దుస్సాక్ష్య మం
చన్నన్ జంకఁడు వీనిపుట్టు పతివర్ణ్యం బయ్యె? మల్లేశ్వరా॥ 568

మ. అనృతంబున్ వ్యభిచారమున్ మఱియు మద్యాసక్తి యీ మాటికిన్
మనుజుం డెంతయు దవ్వుగాఁ జనవలెన్ మన్నించుచో నొక్కమా
అనుమానింపఁ డిఁకెన్ని మార్లయిన నీ యల్పాత్ముఁ డిట్లేసుమా?
జననింద్యం బపసాక్ష్యమున్ బలుకఁగా జంకండు మల్లేశ్వరా॥ 569

మ. అనృతంబాడెడి దేబెకన్న నన్నృతం బాడంగ జేరేచు దు
ర్జనమూర్ధన్యునకన్న నిక్కమెదలోఁ జర్చించి శోధించినన్
"నిను దూషించుట యుక్త"మంచుఁ దలఁతు"న్నేనెందుచే?"నన్న స
ర్వనియంతృత్వము నీది యీయఘము నిన్ బాధించు మల్లేశ్వరా॥ 570

మ. సకలాధీశ్వరుఁ డైన కృష్ణునకు ఘోషం బెట్టులో యల్లె నీ
కొకయీయీ రసుఁ బాల్య మిచ్చుటి యయోగ్యుల్ యోగ్యులు న్నీయకీ
ర్తికి సత్కీర్తికిఁ గారకుల్.గనుక నిన్ దీవింప నుంకింతు రీ
పరికృతాఘమ్మనెడఁ బరిజల్ తెలిసియే పాలింపు మల్లేశ్వరా॥ 571

శా. రాజుల్ రాష్ట్రకృతాఘభోక్తలు,భవదారిజ్యంబు మా గ్రామ.మెం
తే జాగర్తగ లోకముల్ మనుచు నీ కీ యూ రెటుల్ భార మో
భారిజవారిజశిరోవతంస?సరిగాఁ బాలింపు,లేకున్నచో
నేఁ జెప్పన్ బని లేదు లోకులు నిను న్నిందింత్రు మల్లేశ్వరా॥ 572

శా. ఏకర్మమ్మననో యెఱుంగ నకటా?యెన్నో పొలా లుండి సు
శ్రీకంబుల్ పలుపంట లుండియుసు వాసిన్ బొల్చు గే స్త్రాకఁదే
సీ తానంబడఁ డీ భవన్నిలయమై యేపాటు మా పాటియుం
డే కుగ్రామము దీనికన్న మెఱుఁగే యిప్పట్ల మల్లేశ్వరా॥ 573

శా. "ఈ నీచాత్ముల కారణంబుననె యీ రిట్లయ్యెఁ బో" మ్మందువే
సి నక్కల్ జనియించి మొన్ననె కదా?యెన్నో తరా లయ్యె నూ
రీ నిశ్శ్రీకతకున్ గడంగి, యెదియో హేత్వంతరం బుండెడిన్
దాని న్నీవు దొలంచి పోరివఁదగవే? తత్త్వజ్ఞ మల్లేశ్వరా॥ 574

శా. గ్రామక్షేమముఁ గోరి సారెకు నినుం బ్రార్థించెదన్ దేవ? త
త్క్షేమం బెప్పుడు సిద్ధమౌ నపుడె మత్క్షేమంబు సంసిద్ధమౌ,
స్వామీ?దుష్టుల శిక్షయున్ మఱియు శిష్టవ్రాతసంరక్షయున్
సామాన్యమ్మగ నీ ద్వయంబె జగతిన్ శాసించు మల్లేశ్వరా॥ 575

మ. పదియున్నాలుగులోకముల్ మనుచు నీ ప్రాగల్భ్య మీ యూరికిం
గను రేర్పర్చఁగఁ జాల దంచు మది నాకుం దోఁప దీ యూర దు

ర్మదులున్ మిక్కిలి లేరు వాండ్రెనెటులో మాయించియే యుంటి విం
కది నా కోరికి గాదు గ్రామమునకున్ హా యిమ్ము మల్లేశ్వరా॥ 576

శా. చాతుర్వర్ణ్యముగూడ సంపదలతోఁ జక్కంగ వర్ధిల్లి ప్ర
ఖ్యాతిప్రాపక మైన కార్యములయం దాసక్తి రెట్టించి దు
ర్నీతిన్ దూరముగాఁ ద్యజించునెడలన్ శ్రీయుక్తమై హాయితో
నేతద్గ్రామము భాసమాన మగు నం చే నెంతు మల్లేశ్వరా॥ 577

శా. శ్రేణుల్ రెంటికి ని ల్లొకం డయి, బుధాశీర్ధారమై బ్రాహ్మణ
ప్రాణంబై చను విద్యలందు లవమే నాసక్తిఁ గైకోక య
వ్వాణీభక్తుల గేలిఁగొట్టెడి ద్విజవ్యాధుల్ ప్రకోపించుచో
రాణన్ బొల్చునె యెట్టియూరు నగజాప్రాణేశ? మల్లేశ్వరా॥ 578

శా. చాలన్వట్టు దురాగతుల్ చెడిరి నిస్సందేహమే కాని వి
ద్యాలౌల్యమ్మునఁ బొల్చు బ్రాహ్మణులు లే రక్కారణంబై యిటన్
గాలక్షేపము సాధుసజ్జనులకున్ గష్టమ్ముగాఁ దోఁచు నీ
వీ లోపమ్ము హరించి గ్రామమును బై కెక్కింపు మల్లేశ్వరా॥ 579

శా. అంతో యింతొ యనాది మా కులమె విద్యాభాగ్యసంపన్నతా
క్రాంతంబై యలరారుచున్నది భవత్కారుణ్యమున్ జేసి, యా
వంతేనిన్ జదువం దెలింగిన మనుష్యప్రాణి యిందెందు లే
దెంతో కష్టమ కాదె?విద్యగలవాఁ డిందుంట మల్లేశ్వరా॥ 580

మ. చదువన్నన్ మనవేదశాస్త్రములు,తత్సంస్కార మీ యూరిలె
క్కది యేమీ?యల స్వర్గలోకమునయం దైనన్ గనన్ రాదు.శ్రే
ష్ఠవశన్ వేదము పూర్ణవిద్యయె,తదౌత్సుక్యమ్మునున్ లేని యూ
రివి,యే రీతిని బాగుఁజేసెదవొ?నీ విద్దాని మల్లేశ్వరా॥ 581

శా. 'ఏలా గేనియు బాగుఁజేయవలె" నం చీ వెంచుచో వెంటనే
శ్రీలున్ సంపదలున్ బ్రతిష్ఠలమునన్ జెల్వారు నల్లంత వా
ణీలాస్యమ్ములు నుప్పతిల్లఁబొడఁగున్ నీ పూజయున్ జక్కఁగా
వాలాయ మ్మగు గ్రామ మర్కతమునన్ వర్ధిల్లు మల్లేశ్వరా॥ 582

మ. భవదంఘ్రిద్వయపూజనంబును సరస్వత్యంచితం బైన వై
భవమున్ గల్గినచోట నెయ్యెడల దౌర్భాగ్యాలవాలమ్ములౌ
నవివేకుల్ తలలెత్తరే, యెటులనో హమ్మాటి జీవచ్ఛవ
బుంవులై పోయెద రర్కు ముందటి తమంబున్ బోలె మల్లేశ్వరా॥ 583

శా. న్యాయాన్యాయవిచారణల్ నెఱపి యన్యాయమ్ము శిక్షించు వా
రే యూరన్ వసియింతురో యచట దుష్కృత్యమ్ములన్ జేయు రాం
డేయుల్ నిల్వఁగలే రెటో నిలిచినన్ దేజంబుతో నుండఁబో
రీ యూ రట్టిదిగా నొనర్పవలె నీ వీ పైని మల్లేశ్వరా॥ 584

మ. అవశిష్టం బగు పాచకాపశదు దౌరాత్మ్యనకున్ గూడ నీ
భవమందే ఫలమున్ ఘటించితివి తత్పాపిష్ఠతం బట్టి నీ
నవిధమ్మం దటు గోరి యుంటి నిపు డజ్ఞాల్మందు కాల్కుంటియై
నవయన్ జూచుట కష్ట మయ్యెడిఁ జుమీ నా కేమొ మల్లేశ్వరా॥ 585

శా. ఆపత్తుల్ పలురీతు లెల్లరకుఁ బర్యాయమ్మునన్ గల్గుటే
చూపట్టున్ సుకృతాత్మ కస్తికిఁ దటస్థుల్ చింత సూచింత్రు దు
ర్వ్యాపారున్ గని వాని చెట్టతనమున్ వర్ణించి హేతుత్వమం
దాపాదింతురు ప్రస్తుతం బటులె సంప్రాప్తించె మల్లేశ్వరా॥ 586

మ. ప్రతివాఁడున్ సుఖి యౌటకున్, వెతలకున్ బాలౌటకున్ రెండె స
స్మతియున్ దుర్మతియున్, దురాశయుఁడు నేమం బందఁగాఁ బోఁడు స
న్మతి యేనాఁటను బాడుగాఁ, డిదియ యామ్నాయంబు సర్వత్ర పం
డితనమ్ముం దల కాళిదా సిటులె పాడెం బాడి మల్లేశ్వరా॥ 587

మ. అరి నేనిన్ జెడుబుద్ధిలోఁ జొనిపి పాడౌనట్లుగాఁ జేయ కే
త్తైఱ సద్బుద్ధి నొసంగి బాగుపడునట్లే సల్పు మో దేవ? నా
కరియౌ వానికిఁ గూడ నిట్టి ఫల మీ వర్పించుచో లోకు లె
ల్లరు నన్ మెత్తురు నా కిదే పరమ మౌ లాభంబు మల్లేశ్వరా॥ 588

శా. నా కావ్యంబు కతానఁ బెట్టు కొకఁడై నానాఁటికిన్ దీనుఁడై
శోకం బందుటకన్న శత్రువయినన్ శుద్ధాత్ముఁడై దాన సు

శ్లోకుల్ మెచ్చెడిచొప్పు సైకొనినచో స్తుత్యర్హ మం చెంచెదన్
నీ కారుణ్య మొనర్పతేనిపని యున్నే? యొండు మల్లేశ్వరా॥ 589

శా. ఏఁ దెవ్వాఁ? డల వేంకటేశ్వరకవిన్ వేమాఱు దూషించి పై
మోడై గాడటి పాడువాటి తుదకున్ ముమ్మాటికిన్ యోగ్యుఁడై
వ్రీడాపాత్రుఁడు గాఁగ మాఱె, నసుచున్ విజ్ఞుల్ ప్రసంగించుచే
వేఁడంగాఁ బ్రయతింతు నాకు నదియే వేయార్లు మల్లేశ్వరా॥ 590

మ. ఒకటేమాట సుబుద్ధిలేనియెడ నేయోగంబు నీ విచ్చినన్
సకలంబుల్ వికలంబ, సన్మతికి నైశ్వర్యంబు జోడించి త
క్కక మా గ్రామము బాగుసేయుము వృథాకంకోష్టులన్ వృద్ధి సే
యకు మయ్యా చెడుపేరు గ్రామమునకౌ సద్దాన మల్లేశ్వరా॥ 591

మ. ఇది విన్నాఁడవొ లేదొ? మున్ను తమకై యెవ్వాఁడు తా శాపమి
వదరెల్ వాఁ డెటువంటి వాఁడయిన యాపజ్జీవ మవ్వాని ఘం
డు వయస్ జూపుట పాడి కుంకలకు మాదుర్మార్గుల ప్పాపమున్
మద మాఱున్ బడఁ దన్నుఁ బూని రివి పోమా పాడి మల్లేశ్వరా॥ 592

శా. గ్రామం బిట్టిది యెట్టిదైనను సిరుల్ గల్పించి రక్షించుటల్
నీ మాహాత్మ్యపు గుర్తు తుచ్ఛులయెడ న్సేరంబులం జూతురే?
సామాన్యుల్ బలె సున్నతుల్ మునుపు రక్షస్సంతతిన్ మన్నతే
దే? మే మంతకు నెక్కుడౌ ఖలులమే? దేవేశ? మల్లేశ్వరా॥ 593

మ. పొరపొచ్చెమ్ములు మాని సేవనను దప్పుల్లేపు మాయం దటం
చ బువన్ జాలిన యంత సాహసము లే దల్లయ్యు మా గ్రామమున్
బొరపీమైన కతాన నేదయిన నీతో మొట్టపెట్టంగఁ జే
పఁబు భాగ్యోదయ మంచు సారెకు నిటుల్ ఘోషింతు మల్లేశ్వరా॥ 594

మ. ఖలులై భావి దశా విపాకమునఁ గుంకల్ తీరి కూర్చుండి నా
పెలిమిన్ గోల్పడి నాయెడన్ వృథగ దుశ్చేష్టల్ ప్రయోగించి వా
ములపాలై చెడి రన్నవస్త్రములకున్ భూతేశ? నే నేల వా
పలె సీ కష్టనిమిత్త మీ హతకులన్ బాపెంపు మల్లేశ్వరా? 595

మ. మగ లజ్ఞానము కల్మి నా యెడ వృథా మాత్సర్యముం బూని యీ
నసుఁబాటుంగతి దెచ్చి రంచు మగువల్ నన్ గూర్చి శోకించు న
ప్వగ నాకున్ రుచియింప దాసతుల సంభావించి యీ కుంతలల్
బొగులన్ జేయకు మింక నీకుఁ గలుగున్ బున్నెమ్ము మల్లేశ్వరా॥

మ పొగులన్ జేయక యున్న వీండ్రు మరలన్ బోటెక్కి దుశ్చేష్టలన్
వెగఁ గావింతు రటందువో? నలుపనీ దేవేళ? సుశ్శీలురన్
బోగ రొక్కప్పుడు వీడునే? యిపుడి టుల్ పొల్పాటి జీవచ్ఛవ
ప్వగతిన్ గాంచియు వీడిరే? సహజ దుర్దర్పంబు మల్లేశ్వరా॥ 597

మ. స్వకృతాఘమ్మునఁ బాడువారు ఖలులన్ సంపన్ను లీక్షించి తా
మెకసక్కెమ్మొనరింప రోపుగతి నెల్లే నుద్ధరింపంగఁ గొం
కొక యత్నం బొనరించి చూతు రని యే యుక్తంబు రాఁబట్టి వీం
డ్రికనైనే నిటు వేడఁగా వలనె శర్వాణీశ? మల్లేశ్వరా॥ 598

మ. శివనామంబు శివాంగనామణియు నీచేఁ జిక్కె నీవన్నవై
భవ మేవేల్పుల కున్నదిట్టి నిను సంభావించితిన్ గైతచే
శివమస్త్వస్తు శివం శివం భవతుమే చేతశ్చ భూయాచ్ఛివం
శివసంకల్పక మస్త్వపత్యమపిమే శ్రీరస్తు మల్లేశ్వరా॥ 599

—/ గద్య /—

ఇది శ్రీ వేంకటపేందర్రి ఘటాపంచానన విద్వత్కవి బాల
కళానిధి బాలసరస్వతి శతావధానీత్యాది బిరుదాంచితు
లైన శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులలో నొక
రును — కళాప్రపూర్ణులును — ప్రప్రథమాంధ్ర
ఆస్థాన కవితా పట్టభద్రులును అయిన
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారిచే
రచింపబడిన శతక ముకుట
మల్లేశ్వర విజ్ఞప్తి సంపూర్ణము
మల్లేశ్వరార్పణమస్తు!
ఓమ్ తత్సత్

# ★ ముఖ్యమైన సవరణలు ★



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 1 | స్థల | స్థల |
| 10 | 18 | మయ్యో | మ్మయ్యో |
| 11 | 21 | వీదు | వీడు |
| 12 | 12 | యిని | యిది |
| 13 | 19 | ప్రాప్తిస్ | ప్రాప్తిన్ |
| 15 | 5 | వండి | పండి |
| 18 | 19 | మ్మాన్ | మ్మాల్ |
| 19 | 4 | వెంక | లెంక |
| 19 | 10 | నినబూ | బూనిన |
| 19 | 22 | నీప్ప | నిప్ప |
| 20 | 6 | గ్భంగున్ | గ్భంగుల్ |
| 20 | 7 | పులున్ | పులుల్ |
| 20 | 8 | మొృక్కున్ | మ్రొక్కుల్ |
| 21 | 16 | పాృపి | పాృప్తి |
| 21 | 26 | దవయ్యా | దయ్యా |
| 22 | 7 | తుడం | తుండం |
| 22 | 21 | న్పళ | న్పృళ |
| 23 | 12 | రమ్మా | ర్మమ్మా |
| 24 | 7 | మటంటస్ | మంటస్ |
| 25 | 19 | టలె | టన్ |
| 30 | 20 | గారు | గాఱు |
| 40 | 19 | ఘమె | ఘమ్మె |
| 44 | 4 | ద్వధి | ద్వ్యధి |
| 45 | 2 | నటు | నట్లు |
| 46 | 18 | డియు | డియున్ |
| 49 | 3 | పిల్లలస్ | పిల్లల్ |
| 50 | 11 | గుంలెతే | గులెంతే |
| 54 | 1 | దురం | దురారం |
| 55 | 19 | మమ | మ |
| 65 | 4 | లైయిన | లైన |
| 65 | 24 | పఁగ | పంగ |
| 70 | 20 | టంబె | టంచె |
| 76 | 19 | ద్రాభత్వ | ద్రాభత్ర |
| 77 | 24 | లనజ్వా | లానలజ్వా |
| 79 | 1 | ఖమ్మ | ఖము |
| 79 | 23 | ములున్ | ములన్ |
| 80 | 19 | దల్వా | వల్వా |
| 81 | 22 | దద్ధి | ద్ధి |
| 84 | 7 | తుఘా | తుఘు |
| 86 | 24 | టరీ | టమరీ |

89 వ పేజీ 25 వ పంక్తిలోగల "ల్" స్ గా రెండున్ను మార్చుకోవలెను.

98 వ పేజీ 9 వ పంక్తిలో గూడా "ల్" స్ గా మార్చుకోవలెను.

శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి

వ్యాస

రచనలు



# కథలు-గాథలు

4 — సంపుటములోని విషయములు








చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం - P. O.

తూర్పుగోదావరి జిల్లా

శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగా

# కథలు-గాథ

అయిదవ సంపుటములోనుండి విష

## వ్యాస రచనలు



1 అపవాదులు
2 మరొక అపవాద
3 కీర్తి అపకీర్తి
4 కవికన్ను విమర్శకుడికి....
5 వెక్కిరింపబోయి బోల్తాపడ
6 యింకో అపవాద
7 క్షంతవ్యులుగారు
8 బ్రతికించారు ఆచార్యులుగార
9 నన్నయ్యభట్టు
10 "శుభస్య శీఘ్రం"

ఇత్యాదులు.




చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు
వేంకటేశ్వర పబ్లికేషన్సు
కడియం - P. O.
తూర్పు గోదావరి జిల్లా.

# గుంటూరు సీమ

ఇది తిరుపతి వేంకటకవులచే రచింపబడిన విద్యా వివాద గ్రంథ
దవది. ఇది యిదివఱలో రెండు కూర్పులయి యిప్పుడి
కూర్పుగా వెలసినది-ఇందు విశేషమేమనగా-విడివిడిగా ప్ర
బడియున్న పై గ్రంథ వివాదకు సంబంధించినరికార్డు యావత్తు
ఒక క్రమంలో ఇందు సంపుటీకరింపబడి ముద్రించుటయే
అందులోను-వేమవరాగ్రహార శతావధాన పీఠికయున్ను
అందులో లోగడ కొన్ని పద్యాలు మాత్రమే ప్రచు
రించియుండిన ముట్నూరి కృష్ణారాయశతకము
అంతానున్ను యిందు సంపుటీకరించి ప్రచు
రింపబడుట ముఖ్య గమనీయాంశము
గ్రంథము వల్ల కొప్పరపు కవీశ్వ
రులకున్ను-తిరుపతి వేంకటేశ్వ
రులకున్ను-గుంటూరు మం
డలంలో జరిగిన వివా
దకు సంబంధించిన
లోగట్టు యావత్తూ
కరతలామలకముగా
బోధపడగలదు.

* * * * * * * *

---

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు
వేంకటేశ్వర పబ్లికేషన్సు
కడియం - P. O.
తూర్పుగోదావరి జిల్లా.